శ్రీః
శ్రీమతే రామానుజాయ నమః



పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన

# చతుఃశ్లోకి వ్యాఖ్యానమ్

ఆంధ్రానువాద సహితం



**ఆంధ్రానువాదం:**

పండితరత్న, సంత్సంప్రదాయసుధాంబుధి
ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

**సంపాదకుడు:**

ఈయుణ్ణి అనంత రంగ రామన్

27-Feb-2022

# విన్నపము

పూర్వాచార్యప్రణీతాః సురుచిరనుతయో భవ్యవేదాంతతత్త్వం
వ్యాకుర్వాణా మృదూక్త్యా సహృదయహృదయం రంజయంత్యో జయంతి,
సర్వాస్వేతాసు భాతి ద్రమిడనిగమవాగర్థమాధుర్య మేవం
తత్త్వం శ్రీమద్ద్వయాఖ్యావిదితమనుమణేః సర్వదా యచ్చ భావ్యమ్.

శ్రీమద్యామునసూరిభిః కృతచతుఃశ్లోక్యాం రమావైభవం
వేదాంతోదితభవ్యరీతి మనుసృత్యోక్తం మనోజ్ఞం విదామ్,
తత్సర్వం కరుణాప్రచోదితమనాః శ్రీకృష్ణసూరిర్గురుః
వ్యాఖ్యాతీహ మణిప్రవాళసరణిం స్వీకృత్య హృద్యక్రమామ్.

వ్యాఖ్యేయం కృష్ణసూరేః శ్రుతియుగళశిరఃసూక్తిసందర్భగర్భా
న క్లుప్తా నాతి దీర్ఘా చ విశదయతి తత్త్వం శ్రియో లోకమాతుః,
తా మాంధ్ర్యాం శింగరార్యోనువదతి జనిసాఫల్యమాప్తుం సపర్యాం
కృత్వా పద్మాలయాశ్రీచరణకమలయోః వాఙ్మయీాం స్వానురూపామ్.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో నిత్యం అనుసంధించుకోదగిన పూర్వాచార్య స్తోత్రలలో భగవద్యామున కృతమైన 'చతుఃశ్లోకి' ఒకటి. ఇది లక్ష్మీస్వరూపాన్ని క్లుప్తంగా స్తుతిస్తున్నది. ఇందులో నాలుగు శ్లోకాలు ఉన్నందున, దీనికి ఈ పేరు వచ్చింది. లక్ష్మీవైభవాన్ని తెలియజేసే పూర్వాచార్య స్తుతులలో ఇది మొదటిది.

మన పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రాలు అన్నీ కేవలం స్తుతులు కావు. అవి వేద, ఇతిహాస, పురాణాది గ్రంథాలలో, ఆళ్వార్ల, దివ్యప్రబంధాలలో తెలియజేయబడిన విశేషాలను మనకు మధురంగా అందజేస్తాయి. అందువల్ల, వీటిని అనుసంధించుకోవడం ద్వారా ఆయా గ్రంథాలలోని విశేషాలు కూడా అనుసంధించుకున్నవారము కాగలము. అంతేకాక, శ్రీవైష్ణవ సంప్రదాయ స్తోత్రాలన్నీ ద్వయమంత్రార్థాన్ని ప్రధానంగా అందిస్తాయి కనుక, వాటి అనుసంధానం

ద్వయార్థం యొక్క అనుసంధానమే కాగలదు. ఈ కారణం చేతనే పూర్వాచార్య స్తోత్రాలను వ్యాఖ్యానించేటపుడు మన పెద్దలు, సంస్కృత, ద్రావిడ, వేదాంతాలలోని సూక్తులను ఉదాహరిస్తూ వివరించారు.

ఈ క్రమంలోనే పెరియవాచ్చాన్‌పిళ్ళై, యామునుల 'చతుఃశ్లోకి'ని వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానం ఇంతవరకూ తెలుగులో అనువదింపబడలేదు. మూలం మాత్రం ఇంతకుముందు ఒకసారి విజయనగరంలో ఉ.వే.శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భంలో ముద్రింపబడిన నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై 'చతుఃశ్లోకి వ్యాఖ్యానం'తో పాటు ముద్రింపబడింది. ఇపుడు, ఆ మూలానికి తెలుగు అనువాదాన్ని జోడించి, ప్రపన్నలోకానికి సమర్పింపబడుతున్నది.

తమిళ లిపిలో ఈ వ్యాఖ్యానాన్ని, దీనికి సరళమైన తమిళ అనువాదాన్ని అందజేసిన మహనీయులు, శ్రీవైష్ణవ సింహ ఉ.వే.శ్రీమాన్ యెస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు. వారు అందించిన తమిళ వివరణను ఆధారంగా చేసికొని ఈ వ్యాఖ్యానం అనువదింపబడింది. అనువాదంలోని దోషాలను సహృదయ పాఠకులు మన్నించగలరు. ఈ కైంకర్యంలో నన్ను ప్రోత్సహించి, ఆశీర్వదించిన దాసుని పితృ చరణులు న్యాయ వేదాంత విద్వాన్, ఉభయ వేదాంత భాస్కర, ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామి వారి సన్నిధిలో దాసోహపూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. తనవంతు సహకారాన్ని అందజేసి, ఈ గ్రంథాన్ని చక్కగా రూపొందించిన చిరంజీవి, కుమారుడు శ్రీమాన్ ఈయుణ్ణి అనంత రంగ రామన్‌కు అనేక మంగళాశాసనములు. స్వస్తి.

యామునార్య చతుఃశ్లోకీ శబ్దత శ్చార్థత స్తథా,
విభాత్వాచార్యకారుణ్యాత్ హృదయే సర్వదా మమ.



భాగవత చరణాంఘ్రి రేణువు,
ఈ.ఏ.శింగరాచార్యులు



శ్రీమతే రామానుజాయ నమః



భగవద్యామునాచార్య ప్రణీతమైన

# చతుఃశ్లోకీ - సవ్యాఖ్యానమ్

**కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం**
**వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ।**
**బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః**
**శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్॥ 1 ॥**

పరమకారుణికరాన

శ్రీపెరియవాచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయ్‌ద

# చతుఃశ్లోకీవ్యాఖ్యానమ్

**శ్రీమత్కృష్ణసమాహ్వాయ నమో యామునసూనవే।**
**యత్కటాక్షైకలక్ష్యాణాం సులభః శ్రీధరః సదా ॥**

**అవతారికై:–** నమ్ దర్శనత్తుక్కు ప్రధానమ్ రహస్యత్రయ మెన్నుమ్, శ్లోకత్రయ మెన్నుమ్, చతుఃశ్లోకీ యెన్నుమ్ నమ్ ఆచార్యర్‌కళ్ అరుళిచ్చెయ్‌దుపోరువర్‌కళ్. ఇదిల్ తిరుమంత్రత్తాలే స్వరూపముమ్, స్వరూపానురూపమాన పురుషార్థముమ్

---

**అవతారిక వివరణమ్**

మన దర్శనానికి ముఖ్యమైన ప్రమాణాలు మూడు రహస్యాలు అని, మూడు శ్లోకాలు అని, నాలుగు శ్లోకాలు అని మన పూర్వాచార్యులు తెలిపారు. తిరుమంత్రం, ద్వయం, చరమశ్లోకం అనేవి మూడు రహస్యాలు. శ్రీ వరాహస్వామి, జీవులు తరించడం కోసం భూదేవికి తెలిపిన **"స్థితే మనసి"** అని ప్రారంభం అవుతున్న రెండు శ్లోకాలు శ్లోకద్వయమనబడుతుంది. శ్రీయామునులు లక్ష్మీదేవి వైభవాన్ని **"కాంతస్తే"** అని ఆరంభించి నాలుగు శ్లోకాలతో అనుగ్రహించిన స్తోత్రం

ప్రతిపాదిక్కప్పడుకైయాలే, అన్ద పురుషార్థత్తుక్కు ఉపాయచిన్తై పణ్ణుకిఱదు చతుః శ్లోకియాలుమ్, శ్లోకద్వయత్తాలుమ్. ఇవ్విడత్తిల్ చతుఃశ్లోకియాల్ శెయ్‌కిఱదు ఎన్నెన్నాల్ – నమ్బెరుమాళుక్కు దేవతాన్తరఙ్గళైక్కాట్టిలుమ్ వాశి మోక్షప్రదత్వమ్, జగత్కారణత్వమ్–ఎన్గిఱ ఇవై. ఇవైతాన్ ఎత్తాలే వన్దదెన్నాల్ – శ్రియః పతిత్వ–నారాయణత్వఙ్గళాలే వన్ద పరత్వాదిగుణఙ్గళాలే ఎన్లై. వేదార్థమాయిరున్దుళ్ళ అర్థపంచకత్తుక్కు వివరణమాన శ్రీవిష్ణుపురాణత్తిఱ్కు* ----- పర్యాలోచనమ్ పణ్ణియిరున్దుళ్ళ ఆళవన్దార్ స్తోత్రీకరిత్తు, శ్రియఃపతిత్వనిబంధనమాన సౌలభ్యాదిగుణఙ్గళై అనుభవిక్కిఱార్ చతుఃశ్లోకియాలే.

---

**చతుఃశ్లోకి** అనబడుతుంది. ఇందులో, అష్టాక్షరి అనబడే ఎనిమిది అక్షరాలను కల తిరుమంత్రంతో జీవాత్మ యొక్క స్వరూపం, ఆ స్వరూపానికి తగిన ఫలం చెప్పబడినందున, ఆ ఫలాన్ని పొందడానికి తగిన ఉపాయాన్ని వివరిస్తున్నవి – 'చతుఃశ్లోకి', రెండు శ్లోకాలను కలిగిన 'వరాహ చరమశ్లోకం' అనే రెండు. ఇక్కడ చతుఃశ్లోకి ద్వారా చెప్పబడేది ఏమి? అని అంటే, – శ్రీ రంగనాథునకు మిగిలిన దేవతల కంటే గొప్పతనం మోక్షాన్ని ఇచ్చేవాడై ఉండడం, జగత్తుకు కారణమై ఉండడం అనేవి. ఆ స్వామికి ఉండే ఈ గొప్పతనాలు దేనివల్ల వచ్చినవి? – అని అంటే, అతడు లక్ష్మీవల్లభుడై ఉండడం, నారాయణుడై ఉండడం మొదలైనవానితో కలిగిన పరత్వం, సౌలభ్యం మొదలైన గుణాలతో వచ్చినవి. వేదం మొదలైన శాస్త్రాలలో – 1)ఆశ్రయించదగిన పరమాత్మ యొక్క స్వరూపం, 2)ఆ స్వామిని ఆశ్రయించే జీవాత్మ యొక్క స్వరూపం, 3)ఆశ్రయించడానికి తగిన దారి, 4) ఆశ్రయించినందున పొందే ఫలం, 5)ఆశ్రయించడంలో ఏర్పడే విరోధులు అనే అయిదు అర్థాలు చెప్పబడ్డాయి. ఆ ఐదు అర్థాలను విష్ణుపురాణం మొదలైన ప్రమాణాలు వివరిస్తున్నాయి. శ్రీ యామునులు వానిని చక్కగా విచారించి చూచి, రెండు స్తుతుల మూలంగా వానిని తెలియజేశారు. ఆ రెండు స్తోత్రాలలో, లక్ష్మీదేవిని ఉద్దేశించిన ఈ చతుఃశ్లోకి ద్వారా లక్ష్మీనాథుడై ఉండడంవల్ల భగవంతునకు కలిగిన సౌలభ్యం, సౌశీల్యం మొదలైన సహజగుణాలను వివరిస్తున్నారు.

---

* ఇక్కడ కొంతవ్యాఖ్యానం లోపించింది.

ఇదిల్, ముదల్‌శ్లోకత్తాల్ పిరాట్టియినుడైయ నారాయణసంబంధ నిబన్ధనమాన పరత్వమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱదు. ఇరణ్డామ్ శ్లోకత్తాలే అన్ద ప్పరత్వత్తై అనుభవిత్తుక్కొణ్డు పిరాట్టియుడైయ పురుషకారత్వమ్ శొల్లప్పడుకిఱదు. మూన్ఱామ్ శ్లోకత్తాలే ఇప్పడి క్కొత్త సౌలభ్యాదిగుణఙ్గళైయుడైయ పెరియపిరాట్టియారుక్కు జగత్కారణత్వత్తిలుమ్ అన్తర్భావ ముణ్డు ఎన్ఱు మిడత్తై చ్చొల్లి ఉపాయకీర్తనమ్ పణ్ణప్పడుకిఱదు. నాలామ్ శ్లోకత్తాలే కీழ్చ్చొన్న ఉపాయ*....పదువదాయిరున్దుళ్ళ ఫలస్వరూపమ్ నిరూపిక్కప్పడుకిఱదు.

(కాంత స్తే పురుషోత్తమః)– పిరాట్టియై నిరూపిక్కుమ్బోదు ఎమ్బెరుమాన్ సంబంధనిబంధననిరూపణమ్ పణ్ణవేణుమ్. ఇవనైయుమ్, ఇవళుడైయ సంబంధత్తాలే ఎన్ఱుమ్ నిరూపిక్కవేణ్డుమ్. అదెఙ్గనే ? ఎన్నిల్, "కః శ్రీః శ్రియః" (స్తోత్ర–12) ఎన్ఱుమ్, "శ్రియః శ్రియః భక్తజనైకజీవితమ్" (స్తోత్ర–45) ఎన్ఱుమ్, "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా" (పెరియ తిరు–7–7–1) ఎన్ఱుమ్, "ఎన్

ఈ చతుఃశ్లోకి అనే స్తోత్రంలోని మొదటి శ్లోకంతో నారాయణునకు పత్నియై ఉన్నందున లక్ష్మికి కలిగిన గొప్పతనం చెప్పబడుతున్నది. రెండవ శ్లోకంతో ఆ గొప్పతనాన్ని అనుభవిస్తూ, లక్ష్మీదేవి యొక్క పురుషకారభావం చెప్పబడుతున్నది. మూడవ శ్లోకంతో అటువంటి సౌలభ్యాన్ని పరత్వాన్ని కలిగిన లక్ష్మీదేవితో భగవంతునకు లోకానికి కారణం ఉండే సమయంలో కూడా సంబంధం ఉన్నది అని తెలిపి, లక్ష్మీదేవిని, భగవంతుని ఆశ్రయించేవారికి ఆ భగవంతుడు మోక్షోపాయం అవుతున్నాడు అని చెప్పబడింది. నాలుగవ శ్లోకం ద్వారా పూర్వం తెలిపినట్లు భగవంతుని ఉపాయంగాను, లక్ష్మీదేవిని పురుష కారణంగాను ఆశ్రయించినవారు పొందే ఫలం నిరూపింపబడింది.

**వ్యాఖ్యానం:** (కాంతస్తే పురుషోత్తమః) దీని ద్వారా లక్ష్మీదేవి గొప్పదనాన్ని చెప్పేటప్పుడు ఆమె. భగవంతుని పత్ని అని ఆ స్వామియొక్క సంబంధాన్ని పురస్కరించుకునే వివరించాలి. భగవంతుని వైలక్షణ్యాన్ని నిరూపించేటప్పుడు "అతడు లక్ష్మీ నాథుడు" అని ఆ లక్ష్మీయొక్క సంబంధాన్ని పురస్కరించుకుని వివరించాలి. అది ఏ విధంగా? – అంటే, **"కః శ్రీః శ్రియః"** (స్తోత్రరత్నం–12) (లక్ష్మికి కూడా లక్ష్మి అయినవాడు ఎవడో) అని, **"తిరువుక్కుమ్ తిరువాకియ**

* ఇక్కడ కొంతవ్యాఖ్యానం లోపించింది.

తిరుమకళ్ శేర్ మార్బనే" (తిరువాయ్- 7-2-9) ఎన్టుమ్ శొల్లుకైయాలే. పిరాట్టియై నిరూపిక్కుమ్బోదుమ్ "కాన్త స్తే పురుషోత్తమః" ఎన్టుమ్బడియాయిత్తే యిరుప్పదు. "భర్తా తే పురుషోత్తమః" ఎన్నాదే, "కాంత స్తే పురుషోత్తమః" ఎన్బానేన్? ఎన్నాల్,

"రాఘవోఽ ర్హతి వైదేహీమ్" (రామా- సుందర- 16-5) ఎన్టుమ్, "భగవన్నారాయణాభిమతానురూప.... కల్యాణగుణగణామ్" (శరణాగతిగద్య)

---

**శెల్వా"** (పెరియ తిరు-7-7-1) (లక్ష్మికి కూడా లక్ష్మీవంటివాడవు అయిన సంపద్రూపా!), **"ఎన్ తిరుమకళ్ శేర్ మార్బనే"** (తిరువాయ్-7-2-9) (లక్ష్మీదేవి నిత్యం నివసించే వక్షస్థలాన్ని కలిగిన స్వామీ!) అని ఆళ్వార్లు, ఆచార్యులు పలికినందున, లక్ష్మీ స్వరూపాన్ని నిరూపించేటప్పుడు ఈ సందర్భంలోవలెనే భగవంతుని పురస్కరించుకునియే నిరూపించవలసి ఉన్నది. **"భర్తా తే పురుషోత్తమః "** అని చెప్పకుండా, **"కాంత స్తే పురుషోత్తమః"** అని అనడం ఎందుకు? అంటే,

**"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా"** (రామాయణం-సుందరకాండ-16-5) (ఒకేవిధమైన గుణాలువయస్సు, ప్రవర్తన అనే వీటిని కలిగినది, సమానమైన కులాన్ని, లక్షణాలను కలిగినది అయిన వైదేహికి రాముడు తగినవాడు, నల్లని కన్నులను కల ఈమెకు కూడా అతడే తగినవాడు) అని, **"భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణవిభవైశ్వర్యశీలాద్యనవధికాసంఖ్యేయకల్యాణగుణగణాం పద్మవనాలయాం భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవదివ్య మహిషీమ్ అఖిల జగన్మాతరమ్ అశరణ్యశరణ్యామ్ అనన్యశరణః శరణ మహం ప్రపద్యే"** (శరణాగతి గద్యం-1) (భగవానుడైన నారాయణునకు ఇష్టంగా, తగినవిగా ఉండే స్వరూపం, రూపం, గుణం, విభూతి, ఐశ్వర్యం, శీలం మొదలైన అంతులేని గొప్పతనాన్ని కలిగిన, లెక్కలేని కళ్యాణ గుణాలు అనే వీటిని కలిగినది, పద్మవనాన్ని నివాసంగా కలిగినది, పూజించదగినది, ఎల్లప్పుడు భగవంతునికే విడిచి ఉండలేనిది, దోషంలేనిది, దేవదేవుడైన భగవానుని దివ్య మహిషి, అన్ని లోకాలకు తల్లి, విశేషించి నాకు తల్లి, గతిలేనివారికి గతియై ఉన్నది అయిన లక్ష్మీదేవిని వేరొక ఏ గతి లేని నేను శరణు పొందుతున్నాను)

ఎన్నుమ్, ''శ్రీవల్లభ'' (శరణాగతిగద్య) ఎన్నుమ్, ''భోగోపోద్ఘాతకేళీ-చుళకితభగవద్వైశ్వరూప్యానుభావా" (శ్రీగుణ-4) ఎన్నుమ్, "ఉనక్కేఱ్ఱుమ్ కోలమలర్ ప్పావైక్కు అన్బాకియ ఎన్ అన్బేయో" (తిరువాయ్-10-10-6) ఎన్నుమ్, "పిత్తర్ పనిమలర్ మేల్పావైక్కు" (తిరునెడున్దాణ్డకమ్-18) ఎన్నుమ్ ప్రయోగమ్ పణ్ణుకిఱార్కళితే.

"హరిః" ఎన్నుదల్, "విష్ణుః"ఎన్నుదల్ శెయ్యాదే, "పురుషోత్తమః" ఎన్బానెన్? ఎన్నాల్, "ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ, క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర ఉచ్యతే, ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః

---

అని, **"శ్రీవల్లభ!"** (శరణాగతి గద్యం-6) (లక్ష్మీదేవికి నాథా!) అని, **"యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః, వేదాంతాః తత్త్వచింతామురభిదురసి యత్పాదచిహ్నైః తరంతి, భోగోపోద్ఘాతకేళీచులకిత భగవతద్వైశ్వరూప్యానుభావా, సా నః శ్రీరాస్తృణీతా మమృతరహరిధీలంఘనీయై రపాంగైః"** (శ్రీ గుణరత్నకోశం-4) (మురారియొక్క స్థావర జంగమ రూపమైన సృష్టిలోని హెచ్చుతగ్గులకు ఎవరియొక్క కనుబొమ్మల కదలికల కారణం అవుతున్నాయో, మురారియొక్క వక్షస్థలంలో ఎవరి పాదముద్రలను చూచి వేదాంతాలు పరతత్త్వ విచారణను నిర్ణయిస్తున్నాయో, భగవానుని విశ్వరూపానుభవాన్ని తన 'భోగారంభం' అనే క్రీడతోనే ఏలగలిగిన ఆ శ్రీదేవి అమృత సముద్రంలోని కెరటాలను జయించే తన చూపులతో నన్ను చల్లబరచాలి) అని, **"ఉన క్కేఱ్ఱుమ్ రకోలమలర్ పావైక్కు అన్బాకియ ఎన అన్బేయో!"** (తిరువాయ్-10-10-6) (నీకు తగిన లక్ష్మీదేవికి వల్లభుడవై, నా ప్రేమకు ఆస్పదుడవైన స్వామీ!) అని, **"పిత్తర్ పనిమలర్ మేల్ పావైక్కు"** (తిరునెడున్దాణ్డకమ్-18) (చల్లని తామర పువ్వుపై నివసించే లక్ష్మీదేవి విషయంలో వ్యామోహం కలవాడు) అని ఋషులు, ఆచార్యులు, ఆళ్వార్లు ప్రయోగించారు కదా.

"హరిః" అని కాని, "విష్ణుః" అని కాని చెప్పకుండా, "పురుషోత్తమః" అని అనడానికి ఏమి కారణం? - అని అంటే, **"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ, క్షర సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే, ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోక త్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, యస్మాత్**

, యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, యస్మాత్ క్షరమ్" (భ.గీ-15-16-17-18) ఇత్యాది. అచిత్తానదు స్వరూపాన్యథాభావయుక్తమాయిరుక్కుమ్. చిత్తానదు స్వభావాన్యథాభావ-యుక్తమాయిరుక్కుమ్, ఆక, ఉభయాన్యథాభావరహితన్ ఈశ్వరన్ ఎణ్ణుకొణ్డు తనక్కు విభూతిభూతమాన చేతనాచేతనవిలక్షణనెన్ఱిట్టు "పురుషోత్తమః" ఎన్గిఅదన్తో - ఎన్టిఅూర్.

(ఫణిపతిః శయ్యా) - ఒరు రాజావుక్కు అభిమతైయాయిరుప్పాళొరుత్తి, కణ్డపోదు రసిప్పదిత్తనైయొట్రియ ఒరుపడుక్కైయిల్ ఏఅప్పెఱాదేయాయ్త్తు

---

**క్షరమతీతోహ మక్షరాదపి చోత్తమః, అతోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః**," (గీత-15-16-17-18) (క్షరుడని, అక్షరుడని పురుషులు లోకంలో రెండు విధాలైనవారు. అన్ని భూతాలు క్షరులనబడుతున్నారు. కూటస్థుడైన ముక్తాత్మ అక్షరుడనబడుతున్నాడు. ఎవడు మూడు లోకాలలోను వ్యాపించి, అందరిని ధరించేవాడై, ఏ లోటూ లేనివాడై, నియమించేవాడై, పరమాత్మ అని పేరుతో చెప్పబడేవాడు ఉన్నాడో, ఆ పురుషోత్తముడు ముందు చెప్పబడిన పురుషులు ఇద్దరికంటే గొప్పవాడు, విలక్షణుడు. నేను, జ్ఞానంలో హెచ్చుతగ్గులు కల అక్షర పురుషుని అతిక్రమించినవాడను అయినందున, జ్ఞానంలో హెచ్చుతగ్గులు లేని ముక్తపురుషుని కంటే గొప్పవాడనై ఉన్నందున, శ్రుతులలో, స్మృతులలో పురుషోత్తముడు అనే ప్రసిద్ధి పొందాను) అనే గీతా శ్లోకాన్నిబట్టి, అచేతన వస్తువు రూపంలోని మార్పును పొందేదై ఉంటుంది, చేతనుడు తన స్వభావమైన ధర్మభూత జ్ఞానంలో మార్పును పొందేవాడై ఉంటాడు. ఈశ్వరుడు రూపంలో కానీ, స్వభావంలో కానీ మార్పును పొందడు. కనుక, తన సంపద అయిన చేతనాచేతనాల కంటే గొప్పవాడు అనే కారణంచేతనే పురుషోత్తముడు అని చెప్పబడుతున్నాడు కదా - అని అంటున్నారు.

(ఫణిపతిః శయ్యా) పలువురు పత్నులను కల ఒక ప్రభువుకు, పట్టమహిషిని కాక, మిగిలిన పత్నులను చూచినప్పుడు, వారు అతనికి ఆనందించదగినవారై ఉంటారు తప్ప, ఆ ప్రభువుకు తగిన శయ్యను అధిరోహించగల అర్హత కలిగినవారుగా ఉండరు. ఆ విధంగా కాకుండా,

ఇరుప్పదు. అజ్గనన్టిక్కే, "భగవన్నారాయణాభిమతానురూప" (శరణాగతిగద్య) ఎన్నుమ్, "ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ప్పావై" (తిరువాయ్-10-10-6) ఎన్నుమ్, "రాఘవోఽ ర్హతి వైదేహీమ్" (రామా-సుందర) ఎన్నుమ్ ఇప్పడి ప్రమాణమ్ ఉణ్డాకైయాలే కేవలమ్ అభిమతైయాన మాత్రమన్టిక్కే ఇవళుక్కుమ్ ప్రాప్త మెన్గిఱార్.

(ఫణిపతిః) ఎన్గైయాలే. "అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః, ఉద్ధృతా విష్ణునా లక్ష్మీ రుకారేణోచ్యతే సదా, మకార స్తు తయో ర్దాస ఇతి ప్రణవలక్షణమ్" (శ్రుతి), "భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి" (రామా-అయో.) ఎన్నుమ్ శొల్లుకిఱపడియే ఆత్మవస్తువుక్కు ఒరు మిథునశేషత్వమ్ పరమపురుషార్థమాకైయాలే ఇజ్గుమ్

---

ఇంతకుముందే ప్రస్తావింపబడిన **"భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూపగుణవిభవైశ్వర్యశీలాద్యనవధికాసంఖ్యేయకల్యాణగుణగణామ్"** (శరణాగతి గద్య) **"రాఘవోర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా"** (రామాయణం-సుందరకాండ-1-6) మొదలైన ప్రమాణాలను బట్టి, **"ఉన క్కేఱ్కుమ్ కోలమలర్ పావైక్కు"** (నీకు తగిన లక్ష్మీదేవి) అని చెప్పబడిన ద్రవిడవేద ప్రమాణాన్నిబట్టి ఈమె పట్టమహిషి కనుక, మిగిలిన పత్నులవలె కేవలం ప్రియంగా ఉండడమే కాక, ఆ స్వామికి తగినదై ఉండడం వల్ల, అతనికి శయ్యి అయిన ఆదిశేషుడు ఈమెకు కూడా పడుక అవుతున్నాడు - అని అంటున్నారు.

(ఫణిపతిః) ఆదిశేషుడు అని శేషభూతులలో గొప్పవాడు అని అన్నందున, **"అకారేణోచ్యతే విష్ణుః సర్వ లోకేశ్వరో హరిః, ఉద్ధృతా విష్ణునా లక్ష్మీ రుకారేణోచ్య తే సదా"** (శృతి) (అన్ని లోకాలకు ఈశ్వరుడు, హరి అని, విష్ణువు అని చెప్పబడేవాడైన భగవానుడు ఆకారంతో చెప్పబడుతున్నాడు. విష్ణువుచే ఎల్లప్పుడు వక్షస్థలంలో ధరింపబడే లక్ష్మి 'ఉ'కారంచే చెప్పబడుతున్నది. వారికి ఇద్దరికీ దాసుడైన జీవుడు 'మ'కారంచేత చెప్పబడుతున్నాడు - అనేది ప్రణవంలోని లక్షణం), **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (రామా!, నీవు సీతాదేవితో కలసి, పర్వత సానువులలో విహరిస్తావు. అప్పుడు నేను, నీవు మేల్కొని ఉన్నప్పుడు, నిద్రించేటప్పుడు నీకు అన్ని విధాలైన సేవలను చేస్తాను) అనే విధంగా, జీవుడు లక్ష్మీదేవి, పరమాత్మ

వాసుకి–తక్షకప్రభృతికళాన అష్టమహానాగఙ్గళుక్కు ప్పరిబృఢనాయ్, శేషభూతరుక్కుమ్ తలైయాయిరున్దుళ్ళ తిరువన్దాழ்వాన్ ఇరుక్కుమ్బోదు ఉన్ తిరుప్పడుక్కై ఎన్గిఱార్.

(ఆసనమ్ వాహనమ్ వేదాత్మా విహగేశ్వరః)– "సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరో గాయత్రం చక్షుః స్తోమ ఆత్మా సామ తే తనుః వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌ యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం ఛందాంస్యంగాని ధిష్ణియాః శఫాః యజూంషి నామ" (తైత్తి–యజు–4–1–42) ఎన్గిఱపడియే నాగజాతికళిక్కు నాయకనాన అనన్తన్ తిరుప్పడుక్కైయానాప్పోలే, ఇఙ్గుమ్ వేదమయనాయ్, పఱవైకళుక్కు ఆధారనాయిరున్దుళ్ళ పెరియతిరువడి యివళుక్కు ఆసనవాహనఙ్గళ్ ఎన్గిఱార్. అభిమతైయానాల్ పడుక్కైయిల్ అణైక్క ప్రాప్తమాయిరుక్కుమ్. ఏకాసనత్తిల్కొణ్డు ఇరుక్క యోగ్యైయన్టిక్కేయాయ్త్తు ఇరుప్పదు. అఙ్గనన్టిక్కే, "వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై

---

అనే ఇద్దరికీ శేషమై ఉండడం గొప్ప ఫలం కనుక, ఇక్కడ కూడా వాసుకి, తక్షకుడు మొదలైన గొప్ప సర్పాలకు ప్రభువు, శేష భూతులలో గొప్పవాడు అయిన ఆదిశేషుడు నీకు పడుక అవుతున్నాడు.

(ఆసనం వాహనం వేదాత్మా విహగేశ్వరః) **"సుపర్ణోసి గరుత్మాన్, త్రివృత్తే శిరో గాయత్రం చక్షుః, స్తోమ ఆత్మా సామ తే తనూ ర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌ పుచ్ఛం, ఛందాంస్యంగాని యజ్ఞాయజ్ఞీయం ధిష్ణియా శ్శఫా యజూంషి నామ"** (తైత్తిరీయ యజుస్సంహిత–4–1–42) (వేదంలోని పలు భాగాలు గరుడుని అవయవాలు) అనే వేదవాక్యాన్ని బట్టి సర్పాలకు ప్రభువైన ఆదిశేషుడు కనుక అయినట్లే, వేద స్వరూపుడై, సర్పాలకు ప్రభువై, ఆధారమై ఉండే గరుడుడు ఈమెకు ఆసనంగా, వాహనంగా ఉన్నాడు. ప్రభువుకు ప్రియ మహిషి మాత్రమే అయితే, పడుకలో ఆలింగనం చేసుకోవడానికి మాత్రమే తగినదై ఉంటుంది తప్ప, సింహాసనంలో కూర్చుని ఉన్నప్పుడు తనతో పాటు కూర్చొనగలిగిన అర్హతను కలిగి ఉండదు కదా. ఆ విధంగా కాకుండా, **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, రాస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైః భాగవతై స్సహ"** (శైవమ్) (పరలోకమైన వైకుంఠంలో జగత్పతి, భావించడానికి సాధ్యం కాని స్వరూపాన్ని

స్పృహ" ఎన్గిఱపడియే ఇవళ్ అనుకూలరూపైయాయిరుక్కైయాలే ఇవనుక్కాన ఆసనముమ్. వాహనముమ్. ఇవళుక్కుమ్ ప్రాప్తమ్. ఎన్ఱు అరుళిచ్చెయ్ కిఱార్–

ఆక, ఇప్పడి కీర్తిచ్చొన్న యుక్తికళాలే పిరాట్టిక్కు నిత్యవిభూతిసంబంధమ్ శొల్లప్పట్టదు. ఇనిమేల్ శ్లోకశేషత్తాలే లీలావిభూతియోగమెన్న, తదన్తర్వర్తికళాయిరున్దుళ్ళ బ్రహ్మరుద్రాదిదేవగణఙ్గళుదైయ శేషత్వమెన్న–ఇవై శొల్లప్పడుకిఱదు. అదెఙ్గనే యెన్నాల్–

(యవనికా మాయా జగన్మోహినీ), "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" (శ్వేత–4–10) ఎన్ఱుమ్, "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" (బృహ–4–5–19) "దైవీ హ్యేషా గుణమయీ మమ మా యా దురత్యయా, మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" (భ.గీ–7–14)

---

కలిగినవాడు అయిన విష్ణువు భక్తులతో, భాగవతులతో కూడి ఉండేవాడై, శ్రీదేవితో పాటు వేంచేసి ఉంటాడు) అనే విధంగా ఈమె భగవంతునకు పట్టమహిషిగా ఉంటుంది కనుక, భగవానుని ఆసనం, వాహనం ఈమెకు కూడా ఆసనమై, వాహనమై ఉంటాయి – అని అంటున్నారు.

ఈ విధంగా ఇంతవరకూ చెప్పిన లోకన్యాయాల ద్వారా నిత్యవిభూతిలో ఉండే గొప్పతనం చెప్పబడింది. ఇక, ఈ శ్లోకంలోని మిగిలిన భాగంతో ఈమెకు లీలావిభూతితో సంబంధం, ఈ విభూతి లోపల ఉండే బ్రహ్మ, రుద్రుడు మొదలైన దేవసమూహాలు దాసులై ఉండడం చెప్పబడుతున్నది. అది ఏవిధంగా? అంటే,

(యవనికా మాయా జగన్మోహినీ) **"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్"** (శ్వేతాశ్వతరోపనిషత్–4–10) (ప్రకృతి ఆశ్చర్యకరమైన సృష్టికి కారణమై ఉన్నందున దానిని మాయ అని, ఆ మాయను ప్రేరేపించేవానిని మహేశ్వరుడని తెలియాలి), **"ఇంద్రో మాయాభిః పురు రూప ఈయతే"** (బృహదారణ్యకం–4–5–19) (గొప్ప ఐశ్వర్యాన్ని కలవాడై ఉన్నందున ఇంద్రుడు అనబడే పరమాత్మ ప్రకృతి అనే మాయచేత పలురూపాలతో సంచరిస్తున్నాడు), **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"** (గీత–7–14) (దేవుడనైన నా చే నిర్మింపబడినది, మూడు గుణాలను కలిగినది అయిన ఈ నా మాయ దాటరానిది. నన్నే ఎవరు

ఎన్గుమ్ ఇత్యాదికళాలే ప్రతిపాదిక్కప్పట్టిరుక్కిఱ భగవన్మాయైయన్టో ఉనక్కు యవనికై. ఒరు తిరైయిన్ ఉళ్ళిరుక్కుమ్ పేరై ప్పుఱమ్బిలవర్ కాణాదపడియాయ్, పుఱప్పట్టిరుక్కుమ్ పేరై ఉళ్ళిరుక్కుమవర్ కాణాదపడియాయి యిరుప్పదు. అజ్ఞనిరుక్కైయన్టిక్కే (జగన్మోహినీ) ఎన్టు ఎవ్వెబ్బరువానుక్కు త్తిరోధాయికైయాయిరుక్కైయన్టిక్కే జగత్తుక్కు త్తిరోధాయికైయాయిరుక్కు మెన్గిఱార్.

(బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః) భూలోకమ్ తొడజ్గి సత్యలోకపర్యన్తమాక మేలుళ్ళ లోకజ్గళెన్న, అతలవితలసుతలపాతళోత్తాలరసాతల భోగవతీవర్యంతమాన కీళ్ళ్ ఏళ్ళు లోకజ్గళెన్న, ఇవర్కళుక్కు క్కొత్తుముదలికళాయిరున్దుళ్ళ బ్రహ్మరుద్రాదికళెన్న, సరస్వతీరుద్రాణీ పులోమజాప్రభృతికళాయిరున్దుళ్ళ దేవస్త్రీకళెన్న, అప్సరోగణజ్గళెన్న ఇవర్కళెల్లారుమ్ ఆణడిమైయాయ్, పెణ్ణడిమైయుమాయిరుక్కుమ్ ఎన్గిఱార్.

"ఇవై యెల్లామ్ యథార్థమ్ ఎన్టో? స్తోత్రమ్ ఎన్టో? ఇదు ఎజ్గనే కూడుమ్బడి?

---

శరణు పొందుతున్నారో, వారే ఈ మాయను దాట గలుగుతున్నారు) ఇత్యాది ప్రమాణాలతో చెప్పబడినందున భగవంతుని సొత్తు మూలప్రకృతి కదా నీకు మేలిముసుగుగా ఉన్నది. యవనిక అనేది లోకంలో, దానిని ధరించినవారు బయట ఉండేవారిని చూడలేక, బయట ఉండేవారు లోపల ఉండేవారిని చూడలేని విధంగా కదా ఉంటుంది. ఆ విధంగా కాకుండా, **"జగన్మోహినీ"** అని అన్నందున లక్ష్మితో కూడి ఉండే భగవంతునకు బయట ఉండేవానిని ఆవరించకుండా స్పష్టం చేస్తూ, బయట ఉండే లోకానికి వారికి కనుపించకుండా ఆవరించేదిగా కదా యవనిక ఉంటుంది – అని అంటున్నారు.

(బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయియ స్త్వద్దాసదాసీగణః) భూలోకం నుండి ఆరంభించి సత్యలోకం వరకు ఉండే పైలోకాలు ఏడు, అతల, వితల, సుతల, పాతాళ, ఉత్తాల, రసాతల, భోగవతి అనే కింది లోకాలు ఏడు, వీటితో కనుపించే దేవసమూహాలు, వీరిని పాలించే బ్రహ్మ, రుద్రుడు ఇంద్రుడు మొదలగు దేవతలు, వారి భార్యలైన సరస్వతి,గౌరి, ఇంద్రాణి మొదలైన దేవతా స్త్రీలు, అప్సరస స్త్రీలు అనే వీరు అందరూ స్త్రీ పురుష సేవకులై నిన్ను సేవిస్తున్నారు – అని అంటున్నారు.

పైన పలికిన మహిమలు అన్నీ నిజమేనా? లేక, కేవలం స్తోత్రమా?

ఎన్నాల్,

(శ్రీ రిత్యేవ చ నామ తే)– "శ్రీః" ఎన్ఱన్ఱో ఉనక్కు త్తిరునామమ్–ఎన్గిఱార్. ఇత్తాలే ఇవళుక్కు సర్వశేషిణీత్వమ్ తెరివిక్కప్పట్టదో? ఎన్నాల్, "శ్రీజ్–సేవాయామ్" ఎన్గిఱ ధాతువాలే తన్నైయొఴిన్ద చేతనజ్ఞళాలే స్వరూపస్థితిప్రవృత్త్యాదికళుక్కాక ఆశ్రయిక్కప్పడుకిఱాళ్ ఎన్ఱుకొణ్డు "శ్రీః" ఎన్గిఱదు. అదుక్కు ప్రమాణమ్– "ఈశ్వరీం సర్వభూతానామ్" (శ్రీ సూక్తమ్) ఎన్ఱుమ్, "అస్యేశానా జగతః" (నీళాసూక్తమ్) ఎన్ఱుమ్ ఉణ్డాకైయాలే.

(భగవతి)– "తుల్యశీలవయోవృత్తామ్'. (రామా–సుందర–16–5) ఎన్గిఱపడియే ఎమ్బెరుమానోడొక్క హేయప్రతిభటమాయిరున్దుళ్ళ కల్యాణగుణైకతా–

---

ఇది ఏ విధంగా సాధ్యం? అని అంటే,

(శ్రీరిత్యేవ చ నామ తే) మీ పేరు శ్రీ అని కదా అని అంటున్నారు. అందువల్ల ఈమె అందరిచేత సేవింపబడేది అనే అర్థం వస్తుందా – అని అంటే, **"శ్రీజ్–సేవాయామ్"** అనేది ధాతువువల్ల తనకంటే మిగిలిన చేతనాచేతన అందరి చేత తమ స్వరూపం (సత్త) స్థితి, ప్రవృత్తి అనేవానిని పొందడం కోసం ఆశ్రయింపబడుతున్నది అనే అర్థం వస్తుంది కనుక, శ్రీః అనే పదం నీకు నామం అయినది – అని అంటున్నారు. ఈ విషయానికి **"గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్, ఈశ్వరీం సర్వభూతానాం త్వామిహోపహ్వయే శ్రియమ్"** (శ్రీ సూక్తం) (కీర్తిని కలిగించేది, దుష్టులు దగ్గరకు రావడానికి సాధ్యం కానిది, ఎల్లప్పుడూ సమృద్ధిని కలిగినది, అన్ని సంపదలను కలిగినది, ప్రాణులు అందరికీ ఈశ్వరి అయిన శ్రీదేవిని ఇక్కడకు ఆహ్వానిస్తున్నాను) అని, **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (నీళా సూక్తం) (ఈ లోకానికి అంతటికి స్వామిని, విష్ణువునకు పత్ని) అని వేదాలలో ఉన్నది కదా.

(భగవతి) **"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా"** (రామాయణం–సుందరకాండ–1–6–5) (ఒకేవిధమైన గుణాలువయస్సు, ప్రవర్తన అనే వీటిని కలిగినది, సమానమైన కులాన్ని, లక్షణాలను కలిగినది అయిన వైదేహికి రాముడు తగినవాడు, నల్లని కన్నులనుకల ఈమెకు కూడా అతడే తగినవాడు) అనే శ్రీరామాయణ శ్లోకాన్ని

నత్వమ్ శొల్లప్పడుకిఱదు. “మైత్రేయ! భగవచ్ఛబ్ద స్సర్వకారణకారణే, సంభర్తేతి తథా భర్తా భకారోఽర్థద్వయాన్వితః, నేతా గమయితా స్రష్టా గకారార్థ స్తథా మునే, ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః, జ్ఞానవైరాగ్యయ శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా, వసంతి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని, స చ భూతేష్వశేషేషు వకారార్థ స్తతోఽవ్యయః, జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః, భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః, ఏవ మేష మహాశబ్దో మైత్రేయ భగవానితి, పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః, తత్ర పూజ్యపదార్థోక్తిపరిభాషాసమన్వితః, శబ్దోఽయం నోపచారేణ త్వన్యత్ర

---

అనుసరించి, భగవంతునివలె ఈమె కూడా దోషాలకు ప్రతిభటయై, కళ్యాణ గుణాలకు అన్నిటికీ ఆశ్రయమై ఉంటుంది – అని ఈ నామంచేత చెప్పబడుతున్నది. పైన వ్యాఖ్యానంలో ప్రస్తావింపబడిన, **“మైత్రేయ! భగవచ్ఛబ్దః సర్వకారణకారణే, సంభర్తేతి తథా భర్తా భకారోర్థద్వయాన్వితః, నేతా గమయితా స్రష్టా గకారర్థ స్తథా మునే, ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః, జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా, వసంతి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని, స చ భూతేష్వశేషేషు వకారార్థ తతోవ్యయః, జ్ఞాన శక్తిబలైశ్వర్య వీర్య తేజాంస్యశేషతః, భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైః గుణాదిభిః, ఏవ మేష మహాశబ్దో మైత్రేయ భగవానితి, పరబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః, తత్ర పూజ్యపదార్థోక్తిపరిభాషాసమన్వితః, శబ్దోయం నోపచారేణ త్వన్యత్ర హ్యుపచారతః ”** (మైత్రేయా! భగవాన్ అనే శబ్దం అన్ని కారణాలకు మూలకారణమైన సర్వేశ్వరుని విషయంలో ప్రయోగింపబడుతున్నది. ప్రకృతిని కార్యదశను పొందేటట్లు చేసేవాడు (గమయితా) స్వామి, అనే రెండు అర్థాలతో కూడినది, భకారం. ఓ మునీ! ఆ విధంగానే, రక్షించేవాడు, సంహరించేవాడు, సృష్టించేవాడు అనేవి గకారంలోని అర్థాలు. సంపూర్ణమైన ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, సంపద, జ్ఞానం, వైరాగ్యం అనే ఈ ఆరు గుణాలకు ‘భగ‘ అనే శబ్దం వాచకం. ప్రాణులను శరీరంగా కలవాడు, అన్నిటికీ ఆత్మ అయినవాడైన అతనిలో భూతాలు అన్నీ నివసిస్తున్నాయి, అతడు అన్ని భూతాలలోనూ నివసిస్తున్నాడు. అందుచేత నాశనం లేనివాడైన భగవానుడు ‘వ‘కారానికి అర్థం అవుతున్నాడు. హేయగుణాలతో కూడి ఉండని

హ్యుపచారతః” (విష్ణుపు-6-5-72-78) ఎన్డుకొణ్డు ప్రమాణముణ్డాకైయాలే శ్రియః పతియై నిర్దేశిక్కుమ్బోదు “ప్రదిశతు భగవా నశేషపుంసామ్” (విష్ణుపు-6-8-64) ఎన్డుమ్, “స్మర్తవ్యో భగవాన్ హరిః” ఎన్డుమ్, “భగవాన్ భూతైః బాలః క్రీడనకై రివ” (భార. శాంతి-40-78) ఎన్డుమ్, “భగవన్నారాయణ” (శరణాగతిగద్య) ఎన్డుమ్ ఇప్పడి వ్యవహరిక్కవడుప్పదాయితే ఇరుప్పదు. అవళై నిర్దేశిక్కుమ్బోదు”

---

జ్ఞానం, భక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనేగుణాలు భగవాన్ అనే శబ్దంచేత చెప్పబడుతున్నాయి. మైత్రేయా! ఈ విధంగా భగవాన్ అనే ఈ మహా శబ్దం పరబ్రహ్మ అయినావాసుదేవునకే తగినది. వేరు ఎవరికీ తగినది కాదు.”పూజించదగిన అర్థాన్ని నిర్దేశిస్తుంది” అనే పరిభాష తో కూడిన ఈ శబ్దం అతని విషయంలో ఔపచారికంగా ప్రయోగింపబడడం లేదు. మిగిలినవారి విషయంలోనే ఔపచారికంగా, అంటే, అముఖ్యంగా చెప్పబడుతున్నది) అని చెప్పబడింది కదా. లక్ష్మీపతి గురించి చెప్పేటప్పుడు **“ఇతి వివిధ మజస్య యస్య రూపం, ప్రకృతిపరాత్మమయం సనాతనస్య, ప్రదిశతు భగవానశేషపుంసాం హరి రపజన్మజరాదికాం సమృద్ధిమ్”** (శ్రీ విష్ణు పురాణం- 6-8-64) (జన్మ లేనివాడు, ప్రాచీనుడు అయిన విష్ణువుకు పలువిధాలైన ప్రకృతి, దాని కంటే గొప్పదైన దివ్యమంగళ విగ్రహం, ఆత్మ స్వరూపం - అనే ఇవి ఈ విధంగా శరీరాలై ఉన్నాయి. ఆ భగవంతుడైన హరి మానవులందరికీ జన్మ, ముసలితనం మొదలైనవానిని పోగొట్టే మోక్ష సిద్ధిని కలిగించాలి) అని, **“మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః”** (గొప్ప ఆపద సంభవించినప్పుడు భగవానుడైన హరి స్మరించదగినవాడు) అని, **“అనియోజ్యోప్రమేయశ్చ యస్తు కామశరీరగః, మోదతే భగవాన్ భూతైః బాలః క్రీడనకైః”** (భారతం-సభాపర్వం-40-78) (ఎవరికీ నియమించడానికి సాధ్యం కానివాడు, తెలియడానికి సాధ్యం కానివాడు, తనకు ఇష్టమైన రూపాలను ధరించేవాడు అయిన భగవానుడు, చిన్న కుర్రవాడు ఆట వస్తువులతో ఆడుకున్నట్లు, ప్రాణులతో ఆడుకుంటున్నాడు) అని, **“భగవన్నారాయణ“** (శరణాగతి గద్యం) (భగవానుడైన నారాయణుడు) అని ఈ విధంగా భగవచ్ఛబ్దాన్ని పురస్కరించుకుని చెప్పేటట్లుగా కదా ఉన్నది. లక్ష్మిని నిర్దేశించేటప్పుడు కూడా,

"భగవతీం శ్రియం దేవీమ్" (శరణాగతిగద్య) "శ్రీరిత్యేవ చ నామ తే భగవతి" ఎన్నుమ్పడియా- యిరుక్కుమ్.

(బ్రూమః కథం త్వాం వయమ్)-ఈశ్వరగుణస్తవమ్ పణ్ణుమ్పోదు "అనంతా వై వేదాః" (తైత్తి-ఆర-1-16) ఎన్గిఱ వేదఙ్గళుమకప్పడ, "యతో వాచో నివర్తంతే" (తైత్తి-ఆనంద) ఎన్ఱు కొణ్డు అళవుకోల్ ముఱిన్దు మడఙ్గుమ్పడియాయిఱే ఇరుప్పదు. అవన్తన్నైయు మకప్పడ "చులకితభగవద్వైశ్వర్యాప్యై" (శ్రీగుణ) యాయిరున్దుళ్ళ ఉన్నై మన్దమతికళుక్కు అగ్రేసరరాయిరున్దుళ్ళ నాఙ్గళ్ ఎన్ శొల్లి వ్యవహరిప్పదు? ఎన్ఱుకొణ్డు పిరాట్టియినుడైయ పరత్వత్తై ప్రతిపాదిక్కిఱార్ ఆళవన్దార్.

---

**"భగవతీం శ్రియం దేవీమ్"** (పూజించదగినది, ఈ భగవానుని కంటే మిగిలిన అందరిచే ఆశ్రయింపబడేది, ప్రకాశించే మేనిని కలిగినది అయిన లక్ష్మీదేవిని) అని, **"శ్రీరిత్యేవ చ నామ తే భగవతి!"** (కళ్యాణగుణాలు నిండుగా కలిగినదానా! శ్రీః అని నీ పేరు చెప్పబడుతున్నది) అని ఈ విధంగా "భగవతి" అని చెప్పేటట్లుగా కదా ఉంటుంది.

(బ్రూమః కథం త్వాం వయమ్) భగవంతుని గుణాలను స్తుతించే టప్పుడు **"అనంతా వై వేదాః"** (వేదాలు లెక్కలేనివి ) **"యతో వాచో నివర్తంత అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్, న బిభేతి కుతతశ్చ నేతి"** (తైత్తిరీయ ఆనందవల్లి-91) (ఏ పరమాత్మ విషయంలో మనసుతో పాటు వాక్కులు వెనుకకు తిరుగుతున్నాయో, ఆ పరమాత్మయొక్క ఆనంద గుణాన్ని తెలిసినవాడు ఎవరివల్ల భయపడనక్కరలేదు) విధంగా వేదాలకు కూడా అతడు లెక్క కట్టడానికి వీలుకాక, వెనకకు వచ్చేటట్లుగా కదా ఉంటాడు. **"భోగోపోద్ఘాతకేలీచులకిత-భగవద్వైశ్వరూప్యానుభావా సా నః శ్రీః "** (శ్రీగుణరత్న కోశం-4) (భగవానుని విశ్వరూపానుభవాన్ని తన భోగప్రారంభం అనే లీలతోనే అవలీలగా వశం చేసుకోగలిగిన శ్రీదేవి) అనే విధంగా భగవంతుని విశ్వరూపానుభవం కూడా ఈమె చేతిలో అణగి ఉన్నది అనే విధమైన నీ గొప్పతనాన్ని జ్ఞానం లేనివారిలో ముందువారమై ఉండే మేము ఏమని వర్ణించగలం - అని అంటూ ఈ శ్లోకంతో లక్ష్మీదేవియొక్క మహిమను శ్రీ యామునులు పలుకుతున్నారు.

**యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః**
**నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః ।**
**తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యామ్యహం నిర్భయః**
**లోకైకేశ్వరి! లోకనాథదయితే! దాంతే! దయాం తే విదన్ ॥ 2 ॥**

(యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః) "యస్యాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా" (విష్ణు.పు. 1-9-53) ఎన్డుమ్, "స్వశక్తిలేశోద్ధృతభూతసర్గః " (విష్ణుపు-6-5-84) "మనసైవ జగత్సృష్టిం సంహార శ్చ కరోతి యః" (విష్ణుపు-5-22-15) "పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా

---

**2వశ్లో॥ వ్యాఖ్యానమ్:** (యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోపి ప్రభుః నాలం మాతుమియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః) **"యస్యాయుతాయుతాంశాంశో విశ్వశక్తి రియం స్థితా, పరబ్రహ్మస్వరూపస్య ప్రణమామ స్తమవ్యయమ్"** (పరబ్రహ్మ స్వరూపిణి అయిన ఈమె యొక్క పలు వేల అంశలలోని చాలా ఒక చిన్న భాగంలో లోకమనే శక్తి నిలిచి ఉన్నదో, మార్పు లేనివాడైన ఆ పరమాత్మను నమస్కరిస్తున్నాను) , **"సమస్తకళ్యాణ గుణాత్మకోసౌ స్వశక్తిలేశోద్ధృత భూతసర్గః, ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేష జగద్ధితోసౌ"** (విష్ణు పురాణం-65-84) (ఈ భగవానుడు అన్ని కల్యాణగుణాలను సహజంగానే కలవాడు, తన శక్తిలోని చాలా చిన్న భాగంతోనే అన్ని భూతాలను ధరిస్తున్నాడు. తన సంకల్పంతోనే ఉద్ధరింపబడిన, ముఖ్యమైన పలు దేహాలను కలవాడు, ఇతడు జగత్తు అంతటికీ మంచిని కలిగించేవాడు), **"మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతి యః, తస్యారిపక్షక్షపణే కియానుద్యమ విస్తరః"** (విష్ణు పురాణం-5-22-15) (ఏ పరమాత్మ మనసుతోనే లోకసృష్టిని, సంహారాన్ని చేస్తున్నాడో, అతడు శత్రువులను జయించడంలో ఏ పెద్ద ప్రయత్నాన్ని చేయాలి?), **"పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ"** (శ్వేతాశ్వతరోపనిషత్-6-8) (ఈ పరమాత్మకు పలువిధాలైనది ,గొప్పది అయిన శక్తి, సహజమైన జ్ఞానం, బలం, సృష్టించడం మొదలైన క్రియలు ఉన్నాయి అని

చ" (శ్వేత-6-8) ఎన్గుమ్, "ఏకో హ వై నారాయణ ఆసీత్" (మహో) "దివ్యో దేవ ఏకో నారాయణః" (సుబాలోపనిషత్) ఎన్గుమ్ ఇప్పడి ప్రమాణఙ్గళాలే ప్రతిపాదిక్కప్పట్ట పరత్వత్తై ఉడైయవనాయ్, ఉనక్కు వల్లభనాన సర్వేశ్వరను మకప్పడ యచ్ఛబ్దత్తాలే అవాఙ్మానసగోచరమాయిరుక్కిఱ ఉన్నుడైయ అళవిఱన్దిరుక్కిఱ పెరుమైయై ఇవ్వళవు ఎన్గు నిరూపిక్కుమళవిల్ "తనక్కుమ్ తన్ తన్మై యఱివరియాన్" (తిరువాయ్-8-4-6) ఎన్గిఱపడియే తన్ స్వరూపనిరూపణమ్ పణ్ణ త్తాన్ మాట్టాదాప్పోలే ఉన్నుడైయ వైభవనిరూపణమ్ పణ్ణుమ్బోదు అసమర్థనాయిరుక్కుమ్. ఆనాల్ జగత్తుక్కు శేషిద్విత్వమ్ ఉణ్డో? ఎన్నాల్,

(నిత్యానుకూలం స్వతః) "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" (నీళాసూక్తమ్) ఎన్గైయాలే జగత్తైప్పఱ్ఱి ఇవళుక్కు శేషిణీత్వముమ్, అవనైప్పఱ్ఱి శేషత్వముమ్

---

తెలుస్తున్నది), **"ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః నేమే ద్యావా పృథివీ....స ఏకాకీ న రమేత"** (మహోపనిషత్) (సృష్టి ఆరంభంలో నారాయణుడు ఒక్కడే ఉన్నాడు, బ్రహ్మ లేడు, శివుడు, ఆకాశం, భూమి లేవు. అతడు ఒక్కడే ఉన్నవాడై ఆనందాన్ని పొందడం లేదు), **"ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"** (సుబాలోపనిషత్-7) (సమస్త ప్రాణులకు అంతరాత్మ ఉండేవాడు, దోషం లేని వాడు, శ్రీవైకుంఠంలో నివసించే వాడు, దేవుడు అయిన నారాయణుడు ఒక్కడే) అనే ప్రమాణాలతో వివరింపబడిన గొప్పతనాన్ని కలవాడై, నీకు ప్రియ వల్లభుడు, సర్వేశ్వరుడు కూడా మాటకు, మనసుకు అందకుండా ఉండే నీ అంతులేని గొప్పతనాన్ని లెక్కించడం ఆరంభిస్తే, **"తనక్కుమ్ తన్ తన్మై అఱివరియానై"** (తిరువాయ్-8-4-6) (తన గొప్పతనాన్ని తానే తెలుసుకోలేనివాడు) అనే విధంగా తన గొప్పతనాన్ని తాను గ్రహించ లేనట్లుగా ఉంటాడు) అని గొప్పతనాన్ని తాను గ్రహించలేనట్లుగా, నీ గొప్పతనాన్ని కూడా దర్శించలేనివాడు. ఆ విధంగా అయితే, లోకానికి ఇద్దరు నాయకులా? అని అంటే,

(నిత్యానుకూలం స్వతః) **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (ఈ లోకాన్ని పాలించేది, భగవానుడైన విష్ణువునకు పత్ని) అనే ప్రమాణాలను సారం, ఈమె లోకానికి నాయకురాలై ఉన్నా, భగవానునకు శేషమై ఉండే పత్ని అని అన్నందున ఇద్దరు నాయకులు లేరు. ఈ విధంగా భగవానునకు లక్ష్మీదేవి శేషమై ఉంటే,

ప్రతిపాదిక్కప్పడు కైయాలే శేషిద్విత్వమ్ ఇల్లై. "ఆనాల్ ఇవనైప్పఱ్ఱి ఇవళ్ శేషభూతైయాకిల్, ఇవళుడైయ వైభవనిరూపణమ్ పణ్ణవొణ్ణాదే?" ఎన్న వొణ్ణాదు. అదెఙ్గనే యెన్నాల్, "అపూర్వనానార సభావనిర్భరప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధలీలయా" (స్తోత్ర) ఎన్ను అతివిదగ్ధమాయిరున్దుళ్ళ క్రీడావైభవత్తాలే, "పిత్తర్ పనిమలర్ మేల్ పావైక్కు" (తిరునెడున్దాణ్డకమ్-18) ఎన్గిఱపడియే ప్రమేయపరవశనాయిరుక్కైయాలే సర్వజ్ఞనాయిరున్దానేయాకిలుమ్ నిరూపిక్కమాట్టాదేయాయ్త్తు ఇరుప్పదు.

(తామ్ త్వామ్)- కీழ్ప్ ప్రతిపాదిక్కప్పట్ట పరత్వత్తై నిరూపకధర్మమాక ఉడైయైయాయిరుక్కిఱ ఉన్నై-ఎన్నపడి.

(దాస ఇతి)- "అడియేన్" ఎన్నుకొణ్డు ఆశ్రయిక్కిఱేన్ ఎన్గిఱార్. "ఈశ్వరీం సర్వభూతానామ్" (శ్రీసూక్తమ్) ఎన్నుమ్, "అస్యేశానా జగతః" (నీళా సూక్తమ్) ఎన్నుమ్ శొల్లుకైయాలే నమక్కు జగత్తైప్పఱ్ఱి శేషిణీత్వమ్ సాధారణమన్నో! ఉమక్కు

---

ఈమె గొప్పతనం అతడు లెక్క కట్టడానికి సాధ్యంగా అవుతుందా? – అని అంటే, కాదు. ఏ విధంగా అంటే, **"అపూర్వనానా రస భావనిర్భరప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధ లీలయా"** (స్తోత్రరత్నం-44) (ప్రతిక్షణం కొత్తగా ఉండే అనేక విధాలైన రసాలతో నిబిడంగా ఉండేది,అందమైనది సామర్థ్యంతో కూడినదై ఉండే లీలతో) అనే విధంగా అందంగానూ గొప్పతనంతో కూడినదిగాను ఉండేది లీలతో, **"పిత్తర్ పనిమలర్మేల్ పావైక్కు"** (తిరునెడున్దాణ్డకమ్-18) (తామర పూవులో ఉండే లక్ష్మీదేవి విషయంలో వ్యామోహం కలవాడు) అనే విధంగా ప్రేమకు వశమై ఉండేవాడు అయినందున, భగవానుడు అన్నీ తెలిసినవాడైనా, ఈమె గొప్పతనాన్ని తెలియనివాడుగానే ఉంటాడు.

(తాం త్వామ్) పూర్వం చెప్పబడిన గొప్పతనాన్ని నిరూపకంగా కలిగిన నిన్ను – అని అర్థం.

(దాస ఇతి) నీకు శేషభూతుడను అనే ఆకారంతో ఆశ్రయిస్తున్నాను – అని మూడవ పాదంతో తెలుపుతున్నారు. **"ఈశ్వరీం సర్వభూతానామ్"** (శ్రీసూక్తం) (ప్రాణులకు అందరికీ ఈశ్వరి) అని, **"అస్యేశానా జగతః"** (నీలా సూక్తం) (ఈ లోకానికి అంతటికి స్వామిని) అని చెప్పబడినందున "నేను లోకానికి అంతటికి ఈశ్వరి అయి ఉండడం అందరికీ సాధారణం కదా మీకు ఏమి ప్రత్యేకత ఉన్నది?"

అవర్కళిల్కాట్టిల్ విశేషమెన్? ఎన్ఱు పిరాట్టి అరుళిచ్చెయ్దార్. "అవర్కళిల్కాట్టిల్ విశేషమెన్? ఎన్ఱు పిరాట్టి అరుళిచ్చెయ్దార్. అవర్కళిద్కాట్టిల్ నెడువాశి యుణ్డే. స్వరూపానురూపమాన శేషత్వపూర్వకమాక ప్రపన్ననానేన్" ఎన్గిఱార్ (ప్రపన్న ఇతి) ఎన్ఱుకొణ్డు.

(స్తోష్యామ్యహం నిర్భయః) అదినాలే నిర్భయనాయ్ క్కొణ్డు స్తోత్రమ్-పణ్ణుకిఱేన్- ఎన్గిఱార్. స్తోత్రమాకిఱదు ఇల్లాదదొన్ఱై చ్చొల్లుకైయాయిరుక్కుమ్. ఇజ్ఞైత్తెక్కు అజ్ఞనల్ల. "భూతార్థవ్యాహృతి స్సా హి న స్తుతిః పరమేష్ఠినః" ఎన్గిఱపడియే ఇఉళ్ళ గుణఙ్గళైత్తాన్ యథావత్ ప్రతిపాదిక్కప్పోకాదేయాయ్త్తు ఇరుప్పదు. ఇవైయుమ్ ఎత్తాలే ఎన్నాల్?

(లోకైకేశ్వరి)- జగత్తైప్పఱ్ఱి ఇవళ్ శేషిణియాకైయాలే. ఇవళుక్కు

---

అని లక్ష్మీదేవి ప్రశ్నించింది. దానికి సమాధానంగా యామునులు "మిగిలినవారి కంటే నాకు చాలా వైలక్షణ్యం ఉన్నది. ఆత్మ స్వరూపానికి తగినట్లు నీకు శేషమై, శశరణాగతుడనై ఉన్నాను" అని "దాస ఇతి ప్రపన్న ఇతి" అనే ప్రయోగం ద్వారా ఇక్కడ తెలుపుతున్నారు.

(స్తోష్యామ్యహం నిర్భయః) "ఈ విధంగా నీకు శేషమై, ప్రసన్నుడనై ఉన్నందున, భయం లేనివాడనై నిన్ను స్తుతిస్తున్నాను" అని పలుకుతున్నారు. స్తుతి అంటే లేని గొప్పతనాన్ని ఆరోపించి చెప్పేదిగా ఉంటుంది కదా!, ఆ విధంగా స్తుతిస్తున్నావా? - అని అంటే, ఆ విధంగా కాదు **"ఇతి ప్రసాధయామాసుః తే సురా స్తమధోక్షజమ్, భూతార్థవ్యాహృతి స్సా హి న స్తుతిః పరమేష్ఠినః"** (రఘువంశం-10-33) (ఆ దేవతలు ఇంద్రియాలతో తెలుసుకోవడానికి వీలు కానివాడైన ఆ భగవంతుని ఈ విధంగా ఆనందింపచేశారు. పరమపదంలో వేంచేసి ఉండేవాడైన అతని విషయంలో అది నిజమైన విషయాన్ని తెలిపేదే కదా! లేని విషయాన్ని ఆరోపించి చెప్పే స్తోత్రం కాదు కదా!) అనే విధంగా భగవంతునకువలె, లక్ష్మీదేవికికూడా ఉండే గుణాలను యథాతథంగా పలకడంకూడా స్తోత్రమై ఉంటుంది. ఎందుకంటే,

(లోకైకేశ్వరి) లోకానికి ఈమె నాయకురాలు కనుక - అని అర్థం. ఈమెకు లోకానికి నాయకురాలుగా ఉండే స్వభావం ఏ విధంగా వచ్చింది? అని

జగత్తైప్పర్ఱ శేషిణీత్వమ్ ఎత్తాలే వన్దదెన్నాల్,

(లోకనాథయితే)- లోకనాథనాయిరుక్కిఱ నారాయణనుక్కు దివ్యమహిషియాకైయాలే.

“ఇజ్ఞనొత్త మేన్మైయై ఉడైయోమాన నమ్మై ఉమ్మాల్ పరిచ్ఛేదిక్కప్పోమో!” ఎన ప్పిరాట్టి తిరువుళ్ళమాక, “అదు ఒక్కుమ్. ఉముడైయ మేన్మైయై నిరూపిత్తోమాకిలన్త్తో నాజ్ఞళ్ భజ్ఞురధీకళావతు. ఉమ్ముడైయ నీర్మైయై నిరూపిక్కుమ్బోదు మన్దమతికళాయి రున్దుళ్ళ అస్మదాదికళుక్కుమ్ స్తోత్రమ్ పణ్ణుకైయిల్ యోగ్యతై యుణ్డామ్” ఎన్గిఱార్.

(దాంతే)- “కరుణోజ్జ్వలసంవర్ధితైయాయిరుక్కిఱ కల్పకక్కొడియే!”

(దయాం తే విదన్) - దయైయావదు- ‘స్వార్థనిరపేక్షాపరదుః ఖాసహిష్ణుతా” ఎన్గిఱే దయాలక్షణ మిరుక్కుమ్బడి, అజ్ఞనొత్తిరున్దుళ్ళ ఉన్నుడైయ దయైయై అఱియానిన్దుకొణ్డేన్ ఎన్దపడి. అజ్ఞనొత్త కృపైనమ్ పక్కలుణ్డో? ఎన్దు తిరువుళ్ళమాక, “పాపానాం వా....నాపరాధ్యతి” (రామా-యుద్ధ-116-44)

---

అంటే,

(లోకనాథదయితే) లోకానికి అంతటికి నాయకుడై ఉండి నారాయణునకు ఈమె అప్రాకృతమైన పట్టమహిషి కనుక, ఆ విధమైన స్వభావం వచ్చింది? అని భావం.

ఈ విధమైన అతిశయాన్ని కలిగిన నన్ను పరిచ్ఛేదించి పలకడం మీకు సాధ్యం కాదా? అని లక్ష్మీదేవి మనసులో భావించగా, “ఇది నిజం. నీ గొప్పతనాన్ని చూడగలిగితే కదా మేము నిన్ను స్తుతించడం వీలవుతుంది. నీ సౌలభ్యాన్ని దర్శిస్తే, అల్పజ్ఞులమైన మాకు కూడా దానిని స్తుతించడానికి తగిన యోగ్యత ఉన్నది కదా” అని అంటున్నారు.

(దాంతే) ఇది సంబోధన. కరుణతో చాలా వృద్ధి చెందిన కల్పలతికా!

(దయాం తే విదన్) దయ అంటే - **“స్వార్థనిరపేక్షాపరదుఃఖాసహిష్ణుతా”** స్వార్థం లేకుండా ఇతరుల దుఃఖాన్ని సూచి సహించలేని స్వభావం అని కదా దయకు లక్షణం. అటువంటి నీ దయను నేను తెలిసికొన్నాను - అని అర్థం. ఇటువంటి కరుణ నా వద్ద ఉన్నదా? - అని లక్ష్మీదేవి ప్రశ్నించగా, **“పాపానాం**

ఎన్టుకొణ్డు ఎమ్బెరుమాన్ దేవకార్యార్థమాక యాదొరు దివ్యమఙ్గళవిగ్రహత్తై క్కొణ్డాన్, తదనుకూలమాక దేవరీరుమ్ వడివుకొళ్ళక్కడవదా- యిరుక్కైయాలే, అవన్ రాఘవనాయ్ క్కొణ్డు అవతరిత్తపోదు, దేవరీరుమ్ శ్రీజనకరాజన్ తిరుమకళాన సీతైయాయ్‌క్కొణ్డు అవతరిత్తు, రావణనై పుత్రమిత్రకళాత్రాదికళోదు తరైప్పడుతుక్కైక్కాకవుమ్, శ్రీవిభీషణాళ్వానై స్థాపిక్కైక్కాకవుమ్, అశోకైవనికైయిలే ఇరున్దు, కాట్టై వెట్టి నాడాక్కినాప్పోలవుమ్, కళై ప్పఱిత్తు ప్పయిరాక్కుమాపోలవుమ్, అసన్నిరాసపూర్వకమాక సత్పాలనమ్ పణ్ణుకైక్కాక రావణనై క్కొన్ఱరుళినవనన్తరమాక, తర్జనభర్త్సనాదికళై ప్పణ్ణిన రాక్షసికళై క్కొల్లుకైయిలే ఉద్యుక్తనాయిరున్దుళ్ళ తిరువడియై క్కుఱిత్తు ఉన్ పరమకృపైయై ప్రకటీకరిత్త పడియై బుద్ధిపణ్ణిక్కొణ్డు నిర్భయనాయ్ స్తోత్రమ్ పణ్ణినేనెన్గిఱార్ ఆళవన్దార్.

---

**వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ!, కార్యం కరుణ మార్యేణ న కశ్చిత్ నాపరాధ్యతి"** (రామాయణం-యుద్ధకాండ) (వానరా!, గుణాన్ని కలిగినవారు, తమను ఆశ్రయించినవారు పాపం చేసినవారైనా, పుణ్యం చేసినవారైనా, వధించదగివారైనా, వారి విషయంలో కరుణను చూపించాలి. లోకంలో తప్పు చేయనివారు ఎవరూ లేరు కదా!) అని నీ మాటనుబట్టే ఇది వ్యక్తమవుతున్నది. భగవంతుడు దేవతల కార్యాన్ని నెరవేర్చడం కోసం ఏ రూపాన్ని ఎత్తినప్పటికీ దానికి తగిన విధంగా ఉండే ఒక రూపాన్ని ధరించి, అతనిని అనుసరించే నీవు, అతడు రాఘవుడై అవతరించినప్పుడు నీవు జానకివై అవతరించి, రావణుని అతని బంధువులతోపాటు వధింపజేయడం కోసం, విభీషణుని ప్రభువుగా నిలపడం కోసం, అశోకవనంలో పది నెలల కాలం చెరసాలలో ఉండి, అరణ్యాన్ని నరికి నగరం చేసినట్లు, కలుపును పెరికి పంటను పెంచినట్లు, దుష్టులైన రాక్షసులను వధించి విభీషణునివంటి మంచివారిని కాపాడడం కోసం, రావణుని వధించిన తరువాత, అశోకవనంలో నీవు ఉండేటప్పుడు నిన్ను పడరానిపాట్లు పెట్టిన రాక్షసస్త్రీలను వధించాలని ప్రయత్నించిన హనుమంతుని ఉద్దేశించి మంచి మాటలను పలికి, అతనిని అడ్డుకొన్న నీ గొప్ప కరుణను వ్యక్తం చేసిన రీతిని తలచి ఏ భయం లేనివాడనై, నిన్ను స్తుతిస్తున్నాను - అని శ్రీయామునులు పలుకుతున్నారు.

**ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే**
**నష్టం ప్రాక్ స్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్ ।**
**శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే**
**సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥ 3 ॥**

(ఈషత్త్వత్కరుణానిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే నష్టం ప్రాక్ స్తదలాభత స్త్రిభువనమ్)– "పృథివ్యప్సు ప్రలీయతే, ఆప స్తేజసి లీయంతే, తేజో వాయౌ లీయతే, వాయు రాకాశే లీయతే, ఆకాశ మవ్యక్తే లీయతే, అవ్యక్త మక్షరే లీయతే, అక్షరం తమసి లీయతే, తమః పరే దేవ ఏకీభవతి" (సుబాలోపనిషత్–2), ఎన్నుమ్, "న బ్రహ్మా నేశానః నేమే ద్యావా పృథివీ" ఎన్నుమ్, "ఆనీదవాతం స్వధయా తదేకమ్", "తస్మాద్ధాన్యం న పరః కించనాస" (తైత్తి–బ్రాహ్మ–2–8–9) ఎన్నుమ్, "తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్" (బృహ–3–4–7) ఎన్నుమ్, "ఆసీదిదం తమోభూత

---

**3వశ్లో|| వ్యాఖ్యానం**: (ఈషత్త్వత్కరుణా నిరీక్షణసుధాసంధుక్షణాత్ రక్ష్యతే నష్టం ప్రాక్ తదలాభతః త్రిభువనమ్) **"పృథివ్యప్సు ప్రలీయతే, ఆప స్తేజసి లీయంతే, తజో వాయౌ లీయతే, వాయురాకాశే లీయతే, ఆకాశమవ్యక్తే లీయతే, అవ్యక్తమక్షరే లీయతే, అక్షరం తమసి లీయతే, తమః పరే దేవ ఏకీభవతి"** (సుబాలోపనిషత్) (భూమి జలంలో లీనం అవుతున్నది, జలం అగ్నిలో లీనమవుతున్నది. అగ్ని వాయువులో లీనమవుతున్నది. వాయువు ఆకాశంలో లీనం అవుతున్నది. ఆకాశం అవ్యక్తంలో లీనం అవుతున్నది. అవ్యక్తం అక్షరంలో లీనం అవుతున్నది. అక్షరం తమస్సులో లీనం అవుతున్నది. తమస్సు పరమాత్మలో లీనం అవుతున్నది) అని, **"ఏకో వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః నేమే ద్యావాపృథివీ"** (మహోపనిషత్) (నారాయణుడు ఒక్కడే ఉన్నాడు, బ్రహ్మ లేడు, శివుడు లేడు, ఈ ఆకాశం, భూమి లేవు), **"ఆనీదవాతమ్ స్వధయా తదేకమ్, తస్మాద్ధాన్యం న పరః కించ నాస"** (పంచభూతరహితమైన ఆ పరవస్తువు ఒక్కటే స్వధ అనే శబ్దంతో చెప్పబడే లక్ష్మి దేవితో కలసి ఉన్నది. దానికంటే వేరైనది ఏమీ లేదు), **"తద్ధేదమ్ తర్హ్యవికృతమాసీత్, తన్నామరూపాభ్యాం వ్యాక్రియత"** (బృహదారణ్యకమ్ 3–4–7) (ఈ లోకం సృష్టికి ముందు నామరూపాలు లేనిది అయినది. తరువాత

మప్రజ్ఞా తమలక్షణమ్, అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః" (మనుస్మృ-1-5) ఎన్ఱుమ్, "ఒన్ఱుమ్ తేవు ములకు ముయిరుమ్ మఱ్ఱుమ్ యాదు మిల్లా వన్ఱు" (తిరువాయ్-4-10-1) ఎన్ఱుమ్ శ్రుతియోడు, స్మృతియోడు, ఆళ్వార్ పాశురత్తోడు వాశియఱ ప్రతిపాదిక్కిఱ ప్రళయత్తిలే, "నారాయణా ద్బ్రహ్మా జాయతే, నారాయణాద్రుద్రో జాయతే' (నారాయణోపనిషత్) ఎన్ఱుమ్, "ఏకాకీ న రమేత" (తైత్తి.ఆర.) ఎన్ఱుమ్, "బహుస్యామ్ ప్రజాయేయేతి" ఎన్ఱుమ్, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తైత్తి-ఆనంద) ఎన్ఱుమ్, "తన్నామరూపాభ్యాం

---

ప్రకృతిని శరీరంగా కల బ్రహ్మమై ఉన్నది. అది నామరూపాలు కలిగినది అయినది), **"ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాతమలక్షణమ్, అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః"** (మనుధర్మ శాస్త్రం-1-5) (ఈ లోకం తమస్సులో లీనమైనదిగా, ప్రత్యక్షం కానిదిగా, అనుమానంతో కూడా ఊహించడానికి సాధ్యంకానిదిగా, శబ్ద రూపమైన తర్కంతో కూడా తెలియడానికి వీలుకానిదిగా, వేరు దేనివల్ల తెలియడానికి వీలు కానిదిగా, అన్ని వైపులా నిద్రిస్తున్నట్లు చేష్టలు లేనిదిగా ఉన్నది) అని, **"ఒన్ఱుమ్ తేవుమ్ ఉలకుమ్ ఉయిరుమ్ మఱ్ఱుమ్ యాదుమిల్లా అన్ఱు"** (తిరువాయ్-4-10-1) (ఏ దేవతలు, ఏ లోకాలు, ఏ ప్రాణులు, ఇంకా ఏమీ లేని ఆ సమయంలో) అని శృతులతో పాటు, మనుస్మృతితో పాటు, ఆళ్వారుల పాశురాలతో పాటు ఏ తేడా లేకుండా చెప్పబడే ప్రళయకాలంలో, **"నారాయణాత్ బ్రహ్మా జాయతే నారాయణాత్ రుద్రో జాయతే"** (నారాయణోపనిషత్) (నారాయణుని వల్ల బ్రహ్మ పుట్టాడు, నారాయణుని వల్ల రుద్రుడు పుట్టాడు) అని, **"స ఏకాకీ న రమేత"** (అతడు ఒక్కడై ఉండి, ఆనందించడం లేదు) అని, **"తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి, తత్తేజోऽసృజత"** (చాందోగ్యః-6-2-3) (ఆ పరబ్రహ్మం నేనే పలువిధాలుగా కాగలను అని సంకల్పించింది, తేజస్సును సృష్టించింది) అని, **"తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదను ప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్....సత్యం చానృతం చ సత్యమభవత్"** (తైత్తిరీయ-ఆనందవల్లి-6) (దానిని సృష్టించిన తరువాత, ఆ పరబ్రహ్మం దానిని వ్యాపించింది. దానిని వ్యాపించిన తరువాత, వికారం లేనిదైన చేతనంగాను, వికారాలను కలిగినది అయిన అచేతనంగా అయినది. వికారం లేనందువల్ల సత్యం అనబడే చేతనంగాను,

వ్యాక్రియత" ఎన్ఱుమ్, "సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్ యదా స్తే" (పురుష సూ-16) ఎన్ఱుమ్, "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" ఎన్ఱుమ్, "ఆప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్, తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్, తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః, తతః స్వయంభూ ర్భగవానవ్యక్తే వ్యంజయ న్నిదమ్, మహాభూతాదివృత్తౌజాః ప్రాదురాసీత్తమోనుదః" (మనుస్మృ-1-6,8,9) ఎన్ఱుమ్, "నాన్ముకన్ తన్నొడు దేవరులకోడుయిర్ పడైత్తాన్" (తిరువాయ్-4-10-1), "నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్, నాన్ముకనుమ్ తాన్ముకమాయ్ శంకరనై త్తాన్ పడైత్తాన్" (నాన్ముకన్

---

వికారం పొందుతున్నందున అసత్యం అనబడే అచేతనంగాను - ఈ విధంగా బ్రహ్మం వికారం లేనిదిగానే ఆ బ్రహ్మం ఉన్నది), **"తన్నామరూపాభ్యాం వ్యాక్రియత"** (బృహదారణ్యకం-3-4-7) (ఈ లోకాన్ని సృష్టించడానికి ముందు నామరూపాలు లేని తాను ప్రకృతిని శరీరంగా కలిగిన బ్రహ్మమై ఉన్నది. అది నామరూపాలను పొందింది) అని, **"సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్ యదా స్తే"** (పురుష సూ-16) (సర్వజ్ఞుడైన ఏ పరమపురుషుడు అన్ని శరీరాలను సృష్టించి పేర్లను పెట్టి వాటిని ఉచ్చరిస్తున్నాడో, సూర్యుని వంటి వర్ణాన్ని కలవాడు, ప్రకృతి మండలానికి ఆవలివైపున ఉన్నవాడు, అన్నివిధాలుగా గొప్పవాడైన ఈ పరమపురుషుని నేను తెలిసికొంటున్నాను), **"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి"** (తై.నా-8) (మెరుపు వంటి రూపాన్ని కలిగిన పరమపురుషుని నుండి అన్ని నిమేషాలూ(కాల స్వరూపం) పుట్టాయి), **"ఆప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్, తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్, తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః, తతః స్వయంభూ ర్భగవానవ్యక్తే వ్యంజయ న్నిదమ్, మహాభూతాదివృత్తౌజాః ప్రాదురాసీత్తమోనుదః"** (మనుస్మృ-1-6,8,9) (తరువాత, తన ఇచ్ఛతోనే శరీరాన్ని స్వీకరించిన భగవంతుడు, అవ్యక్తమైన ప్రకృతినుండి స్థూలరూపమైన మహాభూతాలు మొదలైన వానిని వ్యక్తంచేసేవాడై, అడ్డులేని బలాన్ని కలిగినవాడు గాను, ప్రకృతిని ప్రేరేపించేవాడుగాను ఆవిర్భవించాడు. ఆ భగవానుడు ప్రారంభంలో జలాన్ని సృష్టించాడు. అందులో తన శక్తి రూపమైన వీర్యాన్ని విడిచాడు. ఆ వీర్యం నుండి బంగారు వర్ణంకల సూర్యునివంటి కాంతిని కలిగినదైన అండం పుట్టింది. అన్ని లోకాలకు పితామహుడైన బ్రహ్మ అందులో స్వయంగా ఆవిర్భవించాడు), **"నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్ నాన్ముకనుమ్ తాన్ముకమాయ్ శంకరనై త్తాన్ పడైత్తాన్"**

తిరు-1) ఎన్ఱుమ్-ఇప్పడి ప్రతిపాదిక్కప్పట్ట బ్రహ్మా ముదలాన సృష్టియై ఈశ్వరన్ ఉకక్కుమ్బోదు, "యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః వేదాంతా స్తత్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి" (శ్రీగుణ-4) ఎన్ఱుమ్, "ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ నిర్వాహకోరకితనేమకటాక్షలీలామ్" (శ్రీగుణ-2) ఎన్ఱుమ్ ఇవళ్ కటాక్షమడిమాక వాయ్త్తు ఉణ్డావదు.

ఇన్నముమ్, పిరాట్టిక్కు జగత్కారణత్వత్తిలే అన్వయముణ్డో? ఎన్ఱు నడాదూర్ అమ్మాళ్ పిళ్ళానై ప్రశ్నమ్ పణ్ణ, "ఆవదెన్? ఇవ్వర్థత్తిల్ సందేహముణ్డో? "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చ ఉత్పాదయితవ్యాః" ఎన్ఱన్డో ఇరుప్పదు

---

(నాన్ముకన్ తిరువందాది-1) (నారాయణుడు బ్రహ్మను సృష్టించాడు. ఆ బ్రహ్మ శంకరుని సృష్టించాడు) అని ఈ విధంగా వివరింపబడిన బ్రహ్మ మొదలైనవారి జన్మను సర్వేశ్వరుడు సంకల్పించినప్పుడు, ఇంతకుముందే ప్రస్తావింపబడిన **"యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః వేదాంతాః తత్వచింతామురభిదురసి యత్పాదచిహ్నైః తరంతి, భోగోపోద్ఘాతకేళీచులకిత భగవతద్వైశ్వరూప్యానుభావా సా నః శ్రీరాస్తృణీతా మమృతరహరిధీలంఘనీయై రపాంగైః"** (శ్రీగుణరత్నకోశం-4) (మురారియొక్క స్థావర జంగమ రూపమైన సృష్టిలోని హెచ్చుతగ్గులకు ఎవరియొక్క కనుబొమ్మల కదలికల కారణం అవుతున్నాయో, మురారియొక్క వక్షస్థలంలో ఎవరి పాదముద్రలను చూచి వేదాంతాలు పరతత్వ విచారణను నిర్ణయిస్తున్నాయో, భగవానుని విశ్వరూపానుభవాన్ని తన భోగారంభం అనే క్రీడతోనే ఏల గలిగిన ఆ శ్రీదేవి అమృత సముద్రంలోని కెరటాలను జయించే తన చూపులతో నన్ను చల్లబరచాలి) అని, **"ఉల్లాస పల్లవిత పాలితసప్తలోకీనిర్వాహకోరకితనేమ కటాక్ష లీలామ్,"** (ఉల్లాసంగా చిగురించేది, రక్షింపబడిన ఏడు లోకాలన నిర్వాహంతో మొగ్గ తొడిగేది అయిన అరమోడ్పు కన్నులను కలిగినది అయిన శ్రీరంగనాధుని దివ్యమహిషి) అని ఈమె కటాక్షంకారణంగానే సృష్టికార్యం సంభవిస్తున్నది.

ఇంతేకాక, "లక్ష్మీదేవికి జగత్కారణత్వంలో భగవంతునితో సంబంధం ఉన్నదా?" అని నడాదూర్ అమ్మాళ్, పిళ్ళాన్‌ను ప్రశ్నించగా, "ఇందులో ఏమి సందేహం? **"ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చోత్పాదయితవ్యాః"** (మన

!ఇవళ్ సహధర్మచారిణి యన్ఱో?" ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్ పిళ్ళాన్.

ఆక, ఇప్పడి శ్రుతిస్మృతికళెన్న, ఆళ్వార్‌పాశురమెన్న, ఇవర్గళై అడియొర్గ్రియవర్ పాశురమెన్న, ఇవర్గాలే ఈశ్వరన్ "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" (తైత్తి-ఆనంద) ఎన్ఱు సృష్టిక్కడవదాక పార్‌త్తరుళినపోదు, (ఈషత్ త్వత్‌కరుణానిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే) అవన్ పార్వైక్కు అనుకూలమాయ్, కరుణాజలపరిపూర్ణమాయిరున్దుళ్ళ ఉన్నుడైయ కటాక్షవిక్షేపఙ్గళాలే- యన్ఱో జగత్తు రక్షిక్కప్పడుకిఱదు.

(నష్టమ్ ప్రాక్ తదలాభతః) అమృతజలవర్షఙ్గళాయిరుక్కిఱ అన్ద కటాక్షమిన్ఱియే ఇరుక్కైయాలేయన్ఱో "అసన్నేవ స భవతి" (తైత్తి-ఆనంద) ఎన్గిఱపడియే నామరూపవిభాగానర్హమాయ్ క్కొణ్డు ఇరున్దదు.

---

ఇద్దరిచే కార్యాలు నిర్వహింపబడాలి, సంతానం సృష్టింపబడాలి) అని తల్లిదండ్రులు ఇద్దరూ కలసి సంతానాన్ని పొందాలని కదా ధర్మశాస్త్రాలు చెబుతున్నాయికదా, ఈ లక్ష్మీదేవి భగవంతుని కార్యాలలో సహాయంగా ఉండే పత్ని కదా" అని తెలియజేశారు.

అందువల్ల, ఈ విధంగా, శృతులు, స్మృతులు, ఆళ్వారుల పాశురాలు, వీటిని అనుసరించి మన పూర్వాచార్యులు అనుగ్రహించిన శ్లోకాలు మొదలైనవాటితో సర్వేశ్వరుడు "తదైక్షత" అని పూర్వం ప్రస్తావించిన ప్రమాణం రీతిలో సృష్టించడం ఆరంభించినపుదు **"ఈషత్త్వత్కరుణా నిరీక్షణసుధాసంధుక్షణాత్ రక్ష్యతే"** అని పూర్వం తెలిపిన విధంగా భగవానుని కటాక్షానికి అనుకూలమైన కరుణాజలం నిండి ఉండే నీ కటాక్షాల ప్రసరణంవల్లనే ఈ లోకం రక్షింపబడుతున్నది.

(నష్టం ప్రాక్ తదలాభతః) అమృతజలాన్ని వర్షించే ఆ కటాక్షం లేనందువల్ల కదా, **"అసన్నేవ స భవతి, అసత్ బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేత్ వేద సంత మేనం తతో విదుః"** (తైత్తిరీయ ఆనందవల్లి-6) (బ్రహ్మం అనేది లేదు అని ఒకడు భావిస్తే , అతడు ఉన్నా లేనివాడే అవుతున్నాడు, బ్రహ్మ ఉన్నది అని ఒకడు భావిస్తే దానివల్ల, ఇతనడు ఉన్నవాడుగా గొప్పవారిచే తెలియబడుతున్నాడు) అనే విధంగా ఈ లోకం సృష్టికి పూర్వం నామరూప విభాగం లేనిదై ఉన్నది.

(సంప్రత్యనంతోదయమ్ )–కదుఙ్కోడైయిలే నొన్ద పయిర్ మేకమేతి వర్షిత్తాల్ తేఱుమాపోలే, నీర్ పార్త్తరుళుకైయాలే ఇప్పోదు ఆనన్తోదయమాయ్త్తు. "ఆవదెన్" ఎన్నాల్, మహీమహీధరజలనిధిరూపమాన జగత్తెన్న, తదంతర్వర్తికళాన దేవతిర్యఙ్మనుష్య స్థావరరూపమాన చతుర్విధదేహప్రవేశమ్ పణ్ణియిరుక్కిఱ ఆత్మకోటికళెన్న, ఇవఱ్ఱై ఉడైత్తాయిఱ్ఱు.

(శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే)– "తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" (ఛాందో–1–6–7) ఎన్గుకొణ్డు ఈశ్వరనుడైయ ఉత్ఫుల్లమాన తామరైప్పూప్పోలే ఇరున్దుళ్ళ తిరుక్కణ్‌మలరిల్ అఙ్గుకు. "మత్స్యః కమలలోచనః" (సహస్రనామభాష్యమ్) ఎన్గుమ్, "మహావరాహః స్ఫుటపద్మలోచనః " (విష్ణు.పు. 1–4–26) ఎన్గుమ్, "రామో రాజీవలోచనః" (రామా.బాల. 20–2)

---

(సంప్రత్యనంతోదయమ్) చాలా తీవ్రమైన అనావృష్టి లో ఎండిపోయిన పైరు, కారు మేఘం ఆకాశంలో అధిరోహించి వర్షిస్తే, మళ్లీ చిగురించినట్లు, నీవు కటాక్షించినందువల్ల అంతులేని గొప్పతనాన్ని జగత్తు పొందినది అయినది అని అర్థం. దీనికి భావం ఏమంటే? – భూమి, పర్వతాలు, సముద్రాలు మొదలైనవి అంతర్భవించిన లోకం గాని, దాని లోపల నివసించే దేవతలు, మానవులు, తిర్యక్కులు, స్థావరాలు అనే నాలుగు విధాలైన దేహాలలో ప్రవేశించి ఉండే జీవాత్మ సమూహాలు మొదలైనవానిని కలిగినది అయినది అని భావం.

(శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతా ప్రసాదాదృతే) **"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య కప్యాసం పుండరీకమేవమక్షిణీ"** (ఛాందోగ్యోపనిషత్) (సూర్యుని మధ్యలో బంగారంవంటి అందమైన రూపాన్ని కల ఏ ఈ పరమ పురుషుడు కనబడుతున్నాడో, అతడు సువర్ణవలె అందమైన మీసాలను, కేశాలను, అన్ని అవయవాలను కలవాడు. అతనికి సూర్యుని వల్ల వికసించిన తామరపువ్వువంటి రెండు నేత్రాలు ఉన్నాయి) అని చెప్పబడే భగవంతుని వికసించిన తామరపువ్వు వలే ఉండే నేత్రాల అందం, **"మత్స్యః కమలలోచనః "** (తామర పువ్వంటి కన్నులన కల మత్స్య మూర్తి), **"తతః సముత్ క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహ స్ఫుటపద్మలోచనః రసతలాదుత్పల పత్రసన్నిభః**

ఎన్నుమ్, "కృష్ణః కమలలోచనః" ఇప్పడి మత్స్యమనుష్యాదివిగ్రహ– పరిగ్రహమ్ పణ్ణినాలుమ్ కణ్ణై మఱైక్కప్పోకాదేయితే యిరుప్పదు. సర్వాఙ్గఙ్గళుమ్ మఱైయుమ్బడియాక క్కవశమిట్టాలుమ్ కణ్ణై క్కవచమిడువా నిలనితే. ఆక, తామరైక్కణ్ణన్ ఎన్గైయాలే ఇవనుక్కు అవాప్తసమస్తకామత్వమ్ శొల్లప్పట్టదు.

(అరవిందలోచనమనఃకాంతా) – ఇఙ్గనొత్త వైభవత్తై ఉడైయనాయిరున్దుళ్ళ ఈశ్వరనుడైయ తిరువుళ్ళత్తిఱ్కు ఉకప్పై ప్పణ్ణుమవళాయిరుక్కుమ్. "భార్యై" ఎన్నాదే "కాంతై" ఎన్బానెన్? ఎన్నాల్, "ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ప్పావైక్కు అన్బాకియ ఎన్

---

**సముత్థితో నీల ఇవాచలోమహాన్"** (వికసించిన తామర పువ్వుల వంటి రెండు నేత్రాలను కలిగినవాడు, నీలోత్పల దళంవంటి వర్ణాన్ని కలిగినవాడు, మహా స్వరూపి అయిన భగవానుడు తన కోరదంతంతో భూదేవిని పాతాళ లోకంనుండి ఉద్ధరించి, గొప్ప నీలపర్వతంవలె పైకి వచ్చాడు), **"ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః, న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః"** (తామర పువ్వుల వంటి కన్నులను కలవాడైన నా రాముడు 16 సంవత్సరాలకు తక్కువ వయస్సు కలవాడు. దశరథుడనైననేను ఇతనిలో రాక్షసులతో యుద్ధం చేయగలిగిన యోగ్యతను చూడలేకున్నాను), **"కృష్ణ కమలలోచనః"** (తామర పూలవంటి కన్నులను కల కృష్ణుడు) అని ఈ విధంగా మత్స్య రూపం, మానవ రూపం మొదలైన ఏ రూపాలను ధరించినప్పటికి స్వామి నేత్రాల సౌందర్యం కప్పిపుచ్చుకోవడానికి వీలులేనట్లుగా ఉంటుంది. అన్ని అవయవాలను ఆవరించేటట్లుగా ఒకడు కవచాన్ని ధరించినా, తన కన్నులను కవచంతో కప్పిపుచ్చుకోవడం సాధ్యం కాదు కదా. అందువల్ల, **"అరవింద లోచన"** (తామర పూలవంటి నేత్రాలు కలవాడు) అని అన్నందున, ఇతడు అన్ని కోరికలు నెరవేరినవాడు – అని చెప్పబడింది.

(అరవిందలోచనమనః కాంతా) ఇటువంటి గొప్పతనాన్ని కలవాడై ఉండేభగవంతుని మనస్సును ఆనందింపజేసేదై ఉంటుంది, లక్ష్మీదేవి. భార్య అని అనకుండా, కాంతా( ప్రియమైనది) అని అనడం ఎందుకు? – అని అంటే, **"ఉనక్కు ఎఱ్కుమ్ కోలమలర్ పావైక్కు అన్బాకియ ఎన్ అన్బేయో"** (తిరువాయ్–

అన్బేయో" (తిరువాయ్-10-10-6) ఎన్గుమ్, "పిత్తర్ పనిమలర్‌మేల్ పావైక్కు" (తిరునెడు-18) ఎన్గుమ్, "అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్" (రామా.సుందర-15-52) ఎన్గుమ్ ప్రమాణముణ్డాకైయాలే కాంతాశబ్దప్రయోగమ్ పణ్ణుకిఱార్. (ప్రసాదాదృతే) - ఇజ్జనొత్తిరున్దుళ్ళ ఇవళుడైయ ప్రసాదత్తై యొழ్గియ.

(సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్) సంసృతి యావదు- ఐశ్వర్యమ్. అక్షరమావదు- కైవల్య మోక్షమ్. వైష్ణవాధ్వావాకిఱదు- "న చ పునరావర్తతే, న చ పునరావర్తతే" (బ్ర.సూ-4-4) ఎన్గుమ్, "తద్విష్ణోః

---

10-10-6) (నీకు తగినదిగా ఉండే లక్ష్మీదేవికి ప్రియమైనవాడవు అయినందున నా ప్రేమకు లక్ష్యమైనవాడా!) అని, **"పిత్తర్ పనిమలర్ మేల్ పావైక్కు"** (తిరు నెడుదాండకమ్-18) (తామర పువ్వుపై నివసించే లక్ష్మీ విషయంలో వ్యామోహం కలవాడు) అని, **"అస్యా దేవ్యా మనః తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్, తేనేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి"** (రామాయణం-సుందర-15-52) (ఈ సీతాదేవి మనసు ఆ రామునిలోనూ, అతని మనస్సు ఈ దేవిలోనూ ప్రతిష్ఠింపబడి ఉన్నది. అందువల్లనే ఈమె, ధర్మాత్ముడైన అతడు కొంచెం కాలం అయినా జీవించగలుగుతున్నారు) అనే ప్రమాణాలు ఈమెను ప్రియమైన పత్ని అని చెప్పినందున, "కాంతా" అనే శబ్దాన్ని ప్రయోగించారు.

(సంస్కృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్) సంసృతి అంటే - సంసారమండలంలో లభించే ప్రాకృతమైన సంపదలు. అక్షరం అంటే - నిత్యవిభూతిలో ఒక మూల పొందే ఆత్మానుభవం అనే కైవల్య మోక్షం. వైష్ణవాధ్వమంటే? **"నచ పునరార్తతే నచ పునరావర్తతే "** (ఛాందోగ్యమ్-8-15 - 1) (ఈ ముక్తాత్మ తిరిగి ఈలోకానికి రావడం లేదు, తిరిగి లోకానికి రావడం లేదు), **"తద్విష్ణోః పరమపదం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతం తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే,తద్విష్ణోః పరమం పదమ్"** (ఋగ్వేదం -1-2-7) (విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడూ దర్శిస్తున్నారు, ఆ పరమపదం అన్నిటిని ప్రకాశింప చేసేవాడు, ఆకాశంలో ఉండేవాడు, జగత్తుకు అంతటికీ నేత్రంవంటివాడు అయిన సూర్యునివలె ప్రకాశం

పరమమ్'' (పురుష సూ.) ఎన్టుమ్, ''పిణైకొడుక్కిలుమ్ పోకవొట్టార్'' (పెరియాళ్వార్. తిరు-4-5-2) ఎన్టుమ్- ఇప్పడి శ్రుతియోడు, ఆళ్వార్ పాశురత్తోడు వాశియఱ ప్రతిపాదిక్కిఱ పరమపదమ్. ఆక, ఇవ్వళ్రికళిల్ అరవిందలోచనమనఃకాంతైయుడైయ ప్రసాదత్తైయొళ్రియ మనుష్యరిల్ వైత్తుక్కొణ్డు ఒరువరుక్కుమ్ శ్రేయస్ వారాదు- ఎన్గిఱార్ ఆళవన్దార్.

**శాంతానందమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపం హరేః**
**మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్ ।**
**యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి చా**
**న్యాహుః స్వై రనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే ॥ 4 ॥**

(శాంతానంతమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపమ్ హరేః) శాంతి యావదెన్? ఎన్టాల్- ''అశనాయా పిపాసే చ శోకమోహౌ జరామృతీ, షడూర్మిభి ర్విశుద్ధా'' ఎన్టుకొన్డు శ్రుతియిల్ శొల్లప్పట్టపడి. షడూర్మిరహితమాయిరుక్కు

---

కలిగినది, విష్ణువు యొక్క ఏ పరమపదం ఉన్నదో, అందులో మేధావులు, స్తుతించడమే స్వభావంగా కలవారు, జాగరూకులై ఉండేవారు అయిన నిత్యసూరులు ప్రకాశిస్తున్నారు) అని, **''పుణై కొడుక్కిలుమ్ పోకవొట్టారే''** (పెరియాళ్వార్ తిరు-4-5-2) (తెప్పను ఇచ్చినా పోనివ్వరు) అని వేదాలతో పాటు, ఆళ్వారుల పాశురాలతో పాటు తేడా లేకుండా పలికే పరమపదం. అందువల్ల, ఈ మూడు పురుషార్థాలను భగవంతుడైన అరవిందలోచనుని ప్రియపత్ని అయిన లక్ష్మీ యొక్క కరుణ లేకుండా వెడితే సంసారులలో ఎవరికీ గొప్పతనం కలుగదు - అని అంటున్నారు యామునులు.

**4వశ్లో॥ వ్యాఖ్యానం:** (శాంతానంత మహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపం హరేః) శాంతి అంటే ఏమి అంటే - **''ఆశనాయాపిపాసే చ శోకమోహౌ జరామృతీ, షడూర్మిభిః విశుద్ధాః''** (ఆకలి, దాహం, శోకం, మోహం, ముసలితనం, మరణం అని ఈ ఆరు ఊర్ములను లేనిది) అని వేదవాక్యంలో చెప్పబడినట్లు ఆరు

మెన్గపడి. ఇన్నముమ్, "అపక్షయవినాశాభ్యాం పరిణామర్ధిజన్మభిః, వర్జితః శక్యతే వక్తుం య స్సదాఽస్తీతి కేవలమ్'' (విష్ణుపు-1-2-11) ఎన్గుకొణ్డు పరాశరమహర్షియాలే ప్రతిపాదిక్కప్పట్టపడి. షడ్భావవికారరహితమ్ ఎన్గిఅదాకవుమామ్.

(ఆనన్ద)- "జ్ఞానానందమయం యస్య స్వరూపం పరమాత్మనః" ఎన్గిఅ పడియే ఆనన్దరూపమాయిరుక్కుమ్. "ఆనన్దరూపమాయిరుక్కై యావదెన్?" ఎన్హాల్, తన్నై త్తానే అనుభవిక్కుమ్బోదు సుఖావహమాయిరుక్కై.

(మహావిభూతి)- "అఙ్గులస్యాష్టభాగోఽపి న సోఽస్తి మునిసత్తమ, న సంతి ప్రాణినో యత్ర కర్మబంధనిబంధనాః" (విష్ణుపు-3-7-4) ఎన్గుకొణ్డు మహర్షికళాలే ప్రతిపాదిక్కప్పడుకైయాలే యాదోరిడత్తిల్ జీవసమూహముణ్డు, అఙ్గే పరమాత్మ సన్నిధి ఉణ్డాయిరుక్కుమ్. అదెఙ్గనే? యెన్నిల్, "యస్యాత్మా శరీరం

---

ఊర్ములను లేనిదై ఉండే భగవానుని స్వరూపం – అని అర్థం. ఇంతేకాక, **"అపక్షయ వినాశాభ్యాం పరిణామర్ధిజన్మభిః, వర్జితః శక్యతే వక్తుం య స్సదాస్తీతి కేవలమ్"** (విష్ణు పురాణం-1-2-11) (తరిగిపోవడం, నాశాన్ని పొందడం, మార్పును పొందడం, పెరగడం జన్మించడం అనే వీటిని లేనివాడుగాను, ఎల్లప్పుడూ "ఉన్నాను" అనే చెప్పబడే ఉండేవాడు, భగవానుడు) అని పరాశర మహర్షి చే చెప్పబడిన ఆరు విధాలైన వికారాలు లేనిది – అని కూడా చెప్పవచ్చు

(ఆనన్ద) **"జ్ఞానానంద మయం యస్య స్వరూపం పరమాత్మనః"** (ఏ పరమాత్మ యొక్క స్వరూపం జ్ఞానానందమయంగా ఉంటుందో) అనే విధంగా ఆనందాన్నే స్వరూపంగా కలిగినది. అంతేకాక, ఆనందాన్నే స్వరూపంగా కలిగినది అని అంటే ఏమి? – అంటే, భగవానుడు తనను తాను అనుభవించేటప్పుడు ఆ స్వరూపం ఆనందాన్ని కలిగించేదిగా ఉండడం.

(మహా విభూతి) **"అంగుల్యగస్యాష్టభాగేపి న సోస్తి మునిసత్తమ, వసంతి ప్రాణినో యత్ర కర్మబంధనిబంధనాః"** (ఓ ముని శ్రేష్టా!, కర్మ బంధాన్ని కారణంగా గల ప్రాణులు లేనిది అయిన అంగుళంలో ఎనిమిదవ భాగంలో ఒక భాగం కూడా లేదు) అని పరాశర మహర్షి పలికినందున, జీవులు ఉండే అన్ని చోట్ల పరమాత్మ కూడా వ్యాపించి ఉంటాడు. అది ఏవిధంగా? అంటే, **"యస్యాత్మా**

యస్య పృథివీ శరీరమ్" (బృహ-5-7) ఎన్హుకొణ్డు ప్రమాణముణ్డాకైయాలే శరీరత్తై యొழிన్దన్ఱిఱే శరీరి యిరుప్పదు. ఆక, ''మహావిభూతి'' ఎన్హు దివ్యాత్మస్వరూపత్తినుడైయ విభుత్వమ్ ప్రతిపాదిక్కప్పట్టదు.

(పరమమ్)- "పరో మాஉ స్యేతి పరమః" ఎన్గిఱపడియే ఇదుతన్నుడైయ నిరుపమత్వమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱదు. "ఇదుక్కు ప్రమాణ మెన్ ? ఎన్నాల్, "న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే", "న సందృశే తిష్ఠతి రూప మస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" (శ్వేత-6), "ఒత్తార్ మిక్కారై యిలైయాయ మామాయా" (తిరువాయ్-2-3-2) ఎన్హుముణ్డాకైయాలే యచ్ఛబ్దత్తాలే ''వచసా మాత్మసంవేద్యమ్'' (విష్ణుపు-6-7-53) ఎన్గిఱపడియే ఇదుతన్నుడైయ

---

**శరీరం యస్య పృథివీ శరీరమ్"** (బృహదారణ్యకం-5-7) (ఎవరికి ఆత్మ శరీరమో, ఎవరికి భూమి శరీరమో) అనే ప్రమాణాల వల్ల ఇది స్పష్టమవుతున్నది. శరీర లేకుండా ఆ శరీరాన్ని వ్యాపించే ఆత్మ ఉండే అవకాశం లేదు కదా! అందువల్ల "మహా విభూతి" అని భగవంతుని ఆత్మస్వరూపం అంతటా వ్యాపించి ఉన్నది అని చెప్పబడింది.

(పరమమ్) - **"పరో మా స్యేతి పరమః"** (ఎవని కంటే గొప్పవాడు ఇంకొకడు లేడో అతడు పరమ శబ్దంతో చెప్పబడుతున్నాడు) అనే వ్యుత్పత్తి ప్రకారం పరమాత్మ స్వరూపం సాటిలేనిది - అని ఈ పదంచేత చెప్పబడింది. దీనికి ప్రమాణం ఏమి? అని అంటే, **''న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే''** (శ్వేతాశ్వతరోపనిషత-6) (ఆ పరమపురుషునకు సమానుడుగాను, మించినవాడుగాను ఎవరూ కనబడడం లేదు), **"న సందృశే తిష్ఠతి రూపమస్య, న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్"** (తైత్తిరీయ నారాయణమ్-1-10) (ఇతని రూపాన్ని కంటితో దర్శించేటట్లు లేదు. ఎవరూ ఇతనిని కంటితో చూడడం లేదు) కానీ వేద వాక్యాలు ఈ విషయంలో ప్రమాణం. ఆழ்వారుల ద్రావిడ వేదంలో కూడా **"ఒత్తార్ మిటక్కారై ఇలైయాయ మామాయా"** (తిరువాయ్-2-3-2) (సాటి వచ్చేవారు, మించినవారు ఎవరూ లేని ఆశ్చర్యకరమైనవాడా!) అని చెప్పబడింది తరవాత ఉండే "యత్" అనే శబ్దంతో **"ప్రత్యస్తమితభేదం యత్ సత్తా మాత్రమగోచరమ్, వచసా మాత్మసంవేద్యం తత్ జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్"** (విష్ణు

అవాఙ్మనసగోచరత్వమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱదు.

(బ్రహ్మ) "బృహత్వాత్ బృంహణత్వా చ్చ బ్రహ్మ ఇత్యభిధీయతే" (విష్ణుపు-3-3-22) ఎన్ఱు శొల్లుకిఱపడియే కీழ్చ్చొన్న మహావిభూతిశబ్దత్తాలే శాబ్దమాక ప్రతిపాదిక్కప్పడుకిఱదు, ఆక, ఇప్పడి. పూర్వపాదత్తాలే షడూర్మిరహితమాయ్, తనక్కు సుఖావహమాయ్, నిరుపమమాయ్, అవాఙ్మనసగోచరమాయ్, బృహత్త్వ- బృంహణతగుణయోగియా యిరుక్కిఱ దివ్యాత్మస్వరూపమ్ ప్రతిపాదిక్కప్పట్టదు.

ఇని, ఉత్తరవాక్యత్తాలే దివ్యమంగళవిగ్రహమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱదు.

(మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్) కీழ్ ప్రతిపాదిక్కప్పట్ట అమూర్త్తమాన బ్రహ్మత్తిఱ్కాట్టిల్ భగవానుక్కు అత్యన్తమ్

---

పురాణం-6-7-53) (జాతి మొదలైన భేదాలు లేనిది, వికారాలు లేనిది, మాటలకు అందనిది, స్వయం ప్రకాశమైనది, జ్ఞాన స్వరూపమైనది బ్రహ్మమని చెప్పబడుతున్నది) అనే విధంగా ఈ బ్రహ్మస్వరూపం మాటలకు, మనసుకు ఇదమిత్థంగా తెలుసుకోవడానికి సాధ్యం కానిది అని చెప్పబడుతున్నది.

(బ్రహ్మ) **"బృహత్వాత్ బృంహణత్వాచ్చ బ్రహ్మ ఇత్యభిధీయతే"** (విష్ణు పురాణం- 3-3-22) (పెద్దదిగా ఉన్నందున ,ఇతరులను పెద్దదిగా చేస్తున్నందున బ్రహ్మమని చెప్పబడుతున్నది) అని చెప్పిన రీతిలో పూర్వం చెప్పబడిన "మహావిభూతి" అనే శబ్దంతో తాత్పర్యార్థంగా తెలుపబడిన బ్రహ్మస్వరూపంలోని విభుత్వం బ్రహ్మ అనే ఈ శబ్దంతో సాక్షాత్తుగానే చెప్పబడుతున్నది. ఈ విధంగా శ్లోకంలోని పై పాదంతో ఆరు ఊర్ములు లేని,తనకు తానే ఆనందం కలిగించేది, సాటి లేనిది, మనసుకు, వాక్కుకు అందనిది, తాను పెద్దగా ఉండడం, ముక్త జీవులను పెద్దవారుగా చేయడం అనేవి గుణాలను కల బ్రహ్మస్వరూపం వివరింపబడింది.

ఇక, శ్లోకంలోని రెండవ పాదంతో పరమపదంలో ఉండే దివ్యమంగళ విగ్రహం వివరింపబడుతున్నది.

(మూర్తం బ్రహ్మ తతోపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్) మొదటి పాదంతో చెప్పబడిన, రూపం లేనిది అయిన బ్రహ్మ స్వరూపం కంటే భగవానునకు చాలా ఎక్కువ ఆనందాన్ని కలిగించేది, రూపాన్ని కలిగినది, బ్రహ్మ అనే పదంతో

ప్రీతిప్రకర్షజనకమాయ్, మూర్త్తమాయ్, బ్రహ్మశబ్దవాచ్యమాయ్, అత్యాశ్చర్యమాయిరు క్కిఱదు యాదొరు దివ్యమఙ్గళ విగ్రహమ్, అదు ప్రతిపాదిక్కప్పడుకిఱదు. "విగ్రహో...."* ఎన్నుమ్, అరూపీ హి జనార్దనః" ఎన్నుమ్, "న తే రూపం న చాకారః" (జితంతే) ఎన్నుమ్ -ఇప్పడి ఈశ్వరనుక్కు విగ్రహ మిల్లై యెన్నుకొణ్డు ప్రమాణఙ్గళ్ ఉణ్డాయిరుక్క, "దివ్యమ్ స్వరూపమ్" ఎన్నుమ్, దివ్యమంగళ విగ్రహమెన్నుమ్ ఎఙ్గనే? ఎన్ను ఇప్పడి చ్చొల్లువార్ వేదాన్తనిష్ఠరుడైయ గోష్ఠియిల్ బహిష్కృతరానపేరితే. ఆవదెన్? చోద్యమ్ పణ్ణినాల్ పరిహరిక్కుమిత్తనైయొఴ్రియ ప్పరివాదియానిన్ఱీర్, ఇప్పడి ప్రమాణముణ్డో ? ఎన్నాల్, ఉణ్డు. అదెఙ్గనే ఎన్నాల్, "య ఏషోఽ న్తరాదిత్యే హిరణ్మయః పురుషో

---

చెప్పబడేది, చాలా అద్భుతమైనది అయిన దివ్య మంగళవిగ్రహం వివరింపబడుతున్నది. **"అరూపీ హి జనార్దనః"** (జనార్దనుడు రూపం లేనివాడు కదా), **"న తే రూపం న చాకారో నాయుధాని చాస్పదమ్, తథాపి పురుషాకారో భక్తానాంత్వం ప్రకాశసే"** (జితంతే-5) (నీ దివ్యాత్మస్వరూపం నీకోసం లేదు, స్వతంత్రమైనది అయిన ఆ రూపం భక్తుల కోసం అవుతున్నది.న నీ దివ్య మంగళ రూపం నీ కోసం లేదు, దివ్యాయుధాలు కూడా నీ కోసం లేవు, నీవుండే దేశమైన వైకుంఠం మొదలైనవి కూడా నీ కోసంగా లేవు. ఇవి అన్ని నీ భక్తులకోసం ఉన్నవి) భక్తుల సొత్తు అయిన నీవు ఈ విధంగా భక్తులకు పరతంత్రమైన విభూతులను కలిగినవాడవు, పురుషసూక్తంలో చెప్పబడిన సర్వాధికుడవై ఉండే స్వభావంతో వెలుగుతున్నావు) అని పరతత్వానికి తిరుమేని అని ప్రమాణాలు చెప్పేటప్పుడు, దివ్యస్వరూపమని, దివ్యమంగళ రూపం అని రెండు ఉన్నాయని చెప్పడం ఏ విధంగా - అని కొందరు తిరుమేనిని తిరస్కరించేవారు. వేదాలలో చక్కని జ్ఞానాన్ని కలిగినవారి గోష్ఠిలో చేరనివారు కదా. ప్రశ్న అడిగితే దానికి బదులు చెప్పడం మానివేసి, ప్రశ్న అడిగినవారిని దూషిస్తున్నారు. మీరు చెప్పే అర్థాలకు ప్రమాణాలు ఉన్నాయా? - అని అంటే, ఉన్నది. ఆ ప్రమాణాలు ఏమి? - అని అంటే, **"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య కప్యాసం**

---

* ఈ ప్రమాణవివరం తెలియలేదు.

దృశ్యతే" (ఛాందో1-6-7)"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి", (తైత్తి-నారా) "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" (పురుషసూ), "ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః సరసిజాసనసన్నివిష్టః, కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః". (నృసింహ పురాణమ్), "కిరీటకౌస్తుభధరమ్ మిత్రాణా మభయప్రదమ్", "నీణ్ణ పొన్ మేనియొడుమ్ నిఱైన్దెన్నుళ్ళే నిన్ఱొళిర్న్దాన్"

---

**పుండరీకమేవ మక్షిణీ"** (చాందోగ్య-1-6,7) (సూర్యునకు మధ్యలో బంగారంవలె అందమైన రూపాన్ని కల ఏ ఈ పరమ పురుషుడు కనబడుతున్నాడో, అతడు బంగారంవలె అందమైన మీసాలను, కేశాలను, అన్ని అవయవాలను కలవాడు. అతనికి సూర్యునిచే వికసింపజేయబడిన తామర పువ్వుల వంటి రెండు కన్నులు ఉన్నాయి), **"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి"** (తైత్తిరీయ నారాయణం-8) (మెరపు అంటి రూపాన్ని కల పురుషునినుండి అన్ని నిముషాలు పుట్టాయి), **"వేదాహమేతం పురుషం మహాంతమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి, నాన్యః పంథా విద్యతేయనాయ"** (పురుష సూక్తం) (వేద పురుషుడను అయిన నేను స్వరూప రూప గుణ విభూతులలో చాలా గొప్పవాడు, సూర్యుని వలె ప్రకాశించేవాడు, ప్రకృతికి ఆవలి వైపున ఉన్నవాడు అయిన ఈ పురుషుని తెలిసికుంటున్నాను. అతనిని ఈ విధంగా తెలిసినవాడు ఇక్కడే ముక్తుడు అవుతున్నాడు. మోక్షం పొందదానికి అతడు తప్ప వేరే గతి లేదు), **"ధ్యేయః సదా సవితృ మండల మధ్యవర్తీ నారాయణః సరసిజాసనసన్నివిష్టః, కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః"** (నరసింహ పురాణం) (సూర్యమండలం మధ్యలో ఉండేవాడు, తామరపువ్వు ఆసనంలో వేంచేసి ఉండేవాడు, బాహుపురులు, మకర కుండలాలు, కిరీటం, హారం అనే వీటిని కలవాడు, సువర్ణ మయమైన శరీరాన్ని కలవాడు, శంఖచక్రాలను ధరించినవాడు అయిన నారాయణుడు ఎల్లప్పుడు ధ్యానించగినవాడు), **"కిరీటకౌస్తుభధరం మిత్రాణా మభయప్రదమ్"** (కిరీటాన్ని, కౌస్తుభమణిని ధరించినవాడు, తన దరి చేరినవారికి అభయాన్ని ఇచ్చేవాడు అయిన భగవంతుని) అని ప్రమాణాలు, **"నీణ్ణ పొన్ మేనియొడుమ్ నిఱైందు**

(తిరువాయ్- 5-5-7) ఎన్ఱుకొణ్డు ఇప్పడి ప్రమాణముణ్డాకైయాలే ఉన్నుడైయ అభిమతమ్ సిద్ధియాదు.

(యాన్యన్యాని యథా సుఖం విహరతో రూపాణి సర్వాణి) "అజాయమానో బహుధా విజాయతే" ఎన్ఱుమ్, "పిఱప్పిల్ పల్ పిఱవిప్పెరుమాన్". (తిరువాయ్-2-9-5) ఎన్ఱుమ్ - ఇప్పడి ప్రమాణముణ్డాకైయాలే జనిజరాదిదురిత దూరనాయిరున్దుళ్ళ సర్వేశ్వరన్ తన్నుడైయ సౌలభ్యమ్ ఎన్గిఱ గుణత్తై ఒప్పమిడుకైక్కాక "బహుస్యాం ప్రజాయేయ" (తైత్తి. ఆనంద) ఎన్ఱుమ్, "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (హరివం-113-62) ఎన్ఱుమ్, "స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః

---

**ఎన్నుళ్ళే నిన్ఱొళిగిన్దాన్"** (తిరువాయ్-5-5-7) దీర్ఘమైన బంగారు శరీరంతో నా మనసులో నిండుగా వేంచేసి ఉన్నాడు) అని నమ్మాళ్వారుల దివ్య సూక్తులు అని ఈ విధంగా పలు ప్రమాణాలు ఉన్నందున భగవంతునకు రూపం లేదు అని అనడం సరి కాదు.

(యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి) **"అజాయమానో బహుధా విజాయతే తస్య ధీరాః పరిజానంతి యోనిమ్"** (పురుషసూక్తం) (కర్మమూలకంగా జన్మలేనివాడైనా, దయామూలకంగా పలు విధాలుగా పరమ పురుషుడు జన్మిస్తున్నాడు. అతని అవతారాలను జ్ఞానం కలిగినవారిలో గొప్పవారే తెలిసి కుంటున్నారు), **"పిఱప్పిల్ పల్ పిఱవిప్పెరుమాన్"** (తిరువాయ్-2-9-5) కర్మ మూలకంగా జన్మలేనివాడైనా, కృపా మూలకంగా పలు విధాలుగా జన్మించే స్వామి) అని ఈ విధంగా ప్రమాణాలు ఉన్నందున, జన్మ, నాశం, ముసలితనం మొదలైన దోషాలు లేని సర్వేశ్వరుడు సౌలభ్యం అనే తనగుణాన్ని వ్యక్తం చేయడంకోసం **"తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి, తత్తేజో஽సృజత"** (చాందోగ్యం-6-2-3) (ఆ పరబ్రహ్మం నేనే పలు విధాలుగా కాగలను అని సంకల్పించి, అది తేజస్సును సృష్టించింది) అని, **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** (హరివంశం-113-62) (పాలకడలిలో పరుండి ఉండే ఈ శ్రీమన్నారాయణుడే ఆదిశేషుడనే పడుకను విడిచిపెట్టి మధురానగరానికి వచ్చాడు), **"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభి,**

, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః" (రామా-అయో-1-7), "సంభవామి యుగే యుగే" (భ.గీ. 18-64) ఎన్నుమ్, "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేషజగద్ధితోఽసౌ" (విష్ణుపు-6-5-84) ఎన్నుమ్, "విష్ణుత్వ ముపజగ్మివాన్" (రామా-85-18) ఎన్నుమ్ ఇప్పడి ప్రమాణ ముణ్డాకైయాలే అదితిక్కు ద్వాదశపుత్రనాయ్ క్కొణ్డు అవతరిత్త అవతారత్తోదుమ్, "తయరతన్

---

**అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుః సనాతనః"** (శ్రీ రామాయణం-అరణ్యకాండ-1-7) (గర్వించిన రావణుని వధను కోరే దేవతలచే ప్రార్థింపబడినవాడు, సనాతనుడు అయిన విష్ణువు మానవలోకంలో జన్మించాడు. ఆ విధంగా అవతరించిన ఆ రాముడే పరావస్థలో కంటే గుణంలో ఎక్కువగా ప్రకాశించేవాడు అయ్యాడు) అని, **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** (గీత-18-64) (సాధువులను రక్షించడం కోసం, దుర్మార్గులను నశింప చేయడం కోసం, వైదిక ధర్మాన్ని నిలుపడం కోసం ప్రతి యుగంలోనూ నేను జన్మిస్తున్నాను), అని, **"సమస్తకల్యాణ గుణాత్మకోసౌ స్వశక్తిలేశోద్ధృత భూతసర్గః, ఇచ్ఛాగృహీతాభిమతోరు దేహః సంసాధితాశేషజగద్ధితోసౌ"** (విష్ణు పురాణం-6-5-84) (ఈ భగవానుడు అన్ని కల్యాణగుణాలను సహజంగానే కలవాడు, తన శక్తిలోని ఒక చాలా చిన్న భాగంతోనే సమస్త ప్రాణులను ధరిస్తున్నాడు. సంకల్పంతోనే తనకు చాలా ఇష్టమైనవి, పలువిధాలైవి అయిన రూపాలను ధరిస్తున్నాడు. ఇతడు జగత్తు అంతటికీ మంచి చేస్తున్నాడు) అని, **"రక్షార్థం సర్వదేవానాం విష్ణుత్వముపజగ్మివాన్"** (రామాయణం-ఉత్తరకాండ-85-18) (సమస్త ప్రాణులను రక్షించడంకోసం విష్ణువై ఉండే స్వభావాన్ని పొందాడు) అని ఈ విధంగా పలు ప్రమాణాలు ఉన్నందున, కశ్యపుని భార్య అయిన అదితికి పన్నెండవ కుమారునిగా అవతరించిన అవతారంతోపాటు, **"దయరదన్ పెర్ర్ఱ మరదకమణిత్తడమ్"** (తిరువాయ్-10-1-8) (దశరథుడు పొందిన మరకతమణి తటాకం) అని రామావతారంతో పాటు, **"మణ్ణిన్ పారమ్ నీంగుదఱ్కే వడమదురై ప్పిఱందాన్"** (తిరువాయ్-9-1-10) (భూభారాన్ని తీర్చడం కోసమే భగవానుడు ఉత్తర మధురానగరంలో జన్మించాడు) అనే విధంగా దేవకీదేవి

పెర్గ్ఱ మరతకమణిత్తడమ్" (తిరువాయ్-10-1-8) ఎన్గిఱ రామావతార త్తోడుమ్, "మణ్ణిన్ పారమ్ నీక్కుదఱ్కే వడమదురై ప్పిఱన్దాన్" (తిరువాయ్-9-1-10) ఎన్గిఱపడియే దేవకార్యార్థమాక అవతరిత్తరుళిన రామకృష్ణాద్యవతారఙ్గళోడుమ్ వాశియఱ.

(తాన్యాహుః స్వై రనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే) "రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణో రేషాఽనపాయినీ" (విష్ణుపు-1-9-144) ఎన్గిఱపడియే అవ్వో అవతారవిగ్రహఙ్గళుక్కు అనురూపమాన ఉన్నుడైయ అవ్వో అవతారఙ్గళిలుణ్డాన దివ్యమఙ్గళవిగ్రహత్తాలే. "ఉపేతం సీతయా భూయ శ్చిత్రయా శశినం యథా". (రామా-అయో-16-10) ఎన్నుమ్, "భర్తారం పరిషస్వజే" (రామా-అర-30-40) ఎన్నుమ్- ఇప్పడి ప్రమాణముణ్డాకైయాలే

---

గర్భం సఫలం చేయడం కోసం బలరాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలు లతోపాటు తేడా లేకుండా అన్ని అవతారరూపాలను - అని అర్థం.

(తాన్యాహుః స్వరూపరూపవిభవైః గాఢోపగూఢాని తే) **"రాఘవత్వేభవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మసు, అన్యేషు చావతారేషు విష్ణో రేషా నపాయినీ"** (విష్ణు పురాణం-1-9-114) (ఈ లక్ష్మీదేవి, భగవానుడు రాముడుగా అవతరించినప్పుడు సీతగాను, కృష్ణుడుగా అవతరించినప్పుడు రుక్మిణిగాను, విష్ణువు యొక్క మిగిలిన అవతారాలలో ఈమె అతనిని విడువకుండా అతని వెంట అవతరించినదిగాను ఉన్నది) అనే విధంగా ఆయా అవతార రూపాలకు తగినవి అయిన నీ యొక్క సీత, రుక్మిణీ మొదలైన రూపాలలో నీవు ధరించిన దివ్య మంగళ రూపంతో, **"స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజనహస్తయా, ఉపేతం సీతయా భూయః చిత్రయా శశినం యథా"** (రామాయణం-అయోధ్యా కాండ- 16-10) (చిత్తా నక్షత్రంతో కూడిన చంద్రునివలె చామరాన్ని చేతిలో ధరించి, దగ్గర ఉండే సీతతో కూడినవాడైన రాముని) అని, **"తం దృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహమ్, బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"** (శత్రువులను నశింపజేసే వాడు, మహర్షులకు సుఖాన్ని కలిగించేవాడైన భర్తను చూచి వైదేహి సత్తను పొందింది, సంతోషాన్ని కూడా పొందింది. భర్త అయిన శ్రీరాముని కౌగలించుకొన్నది) అని ఈ విధంగా ప్రమాణాలు ఉన్నందున భగవానుని, ముందు తెలిపిన, ప్రతిరూపంతోనూ లక్ష్మీదేవి

గాఢమాక ఆలిఙ్గనమ్ పణ్ణుమ్బడియతే యిరుప్పదు. ఆక, ఇన్నాలు శ్లోకఙ్గళాల్ లక్ష్మీవిశిష్టమాన వస్తువే ఉపేయమాక క్కడవదు–ఎన్ఱత్తై అరుళిచ్చెయ్‌కిఱార్ ఆళవన్దార్.

ఆళవన్దార్ తిరువడికళే శరణమ్

పెరియవాచ్చాన్‌పిళ్ళై తిరువడికళే శరణమ్

చతుఃశ్లోకీభాష్యమ్ సమాప్తమ్.



---

దగ్గర సంబంధాన్ని కలిగి ఉన్నది కదా. ఈ విధంగా ఈ నాలుగు శ్లోకాలతో లక్ష్మితో కూడిన నారాయణుడే పొందదగిన ఉపేయం అని శ్రీ యామునులు తెలియజేశారు.

పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన చతుఃశ్లోకి మణిప్రవాళ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం సంపూర్ణమ్

ఆళవందార్ తిరువడిగళే శరణమ్

పెరియవాచ్చాన్ పిళ్ళై తిరువడిగళే శరణమ్

